సంపాదకులు :

బాలాంత్రపు నళినీకాంతరావు

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సహకారం :

పాలగుమ్మి విశ్వనాథం

బాలాంత్రపు రజనీకాంతరావు

కురుమెళ్ల వేంకటరావు

కె. వి. రమణారెడ్డి

నిడమర్తి నిర్మలా దేవి

పి. బి. శ్రీనివాస్

వెలమకన్ని సుబ్రహ్మణ్య శర్మ

వింజమూరి ప్రభాకరం

అవసరాల అనసూయా గిరి

వింజమూరి సీతాదేవి

బి. గోపాలం

పి. ఎస్. గోపాలకృష్ణ

పర్యవేక్షణ :

పాలగుమ్మి పద్మరాజు

ఎ. ఎస్. రామన్

# కృష్ణశాస్త్రి

## వ్యాసావళి-1

### -కవి పరంపర-

రాజహంస  ప్రచురణలు

9, జగదాంబాళ్ స్ట్రీట్, మద్రాసు-600 017

# విషయ క్రమం

★

"మామూలు విషయం చెప్పడానికి మామూలు మాటలు చాలును; మామూలు విషయాన్ని మించినదాన్ని వర్ణించడానికీ, అసలు భావాలను మించిన అనుభవాన్నీ, పరమార్థాన్నీ చిత్రించడానికీ సామాన్య శబ్దాలు ఒక్కొక్కప్పుడు చాలవు. ఇక ఆ మాట లయినా మామూలు కలయికలో, కూర్పులో చూపవలసినంత శక్తి చూపలేవు. అందుకే ఛందస్సు!"

పుట 5

★

# కృతజ్ఞత

ఇంతవరకూ పుస్తక రూపంలో రాని మా నాన్న గారి రచనలు ఈ నాడు ఈ రూపంలో వస్తున్నా యంటే దానికి ముఖ్య కారకులు శ్రీ బాలాంత్రపు నళినీకాంతరావు గారు. సుమారు సంవత్సరన్నర క్రితం నేను వారి సహాయం అడగగానే సంతోషంగా ఈ పని చేపట్టారు. ఆ రోజు లగాయతూ ఈ రోజు వరకూ నిద్రాహారాలు లేకుండా, అక్కడా ఇక్కడా ఉన్న రచనలు చేర్చి, కూర్చి వాటికి ఈ రూపం ఇచ్చారు. వారికి నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. వారి ఋణం నేను ఎప్పటికీ తీర్చుకోలేను.

వారికి చేదోడు వాదోడుగా ఉంటున్న శ్రీ బొమ్మ కంటి శ్రీనివాసాచార్యులుగారికి కూడా నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలకి తొలిపలుకు వ్రాసి ఇచ్చిన శ్రీశ్రీ గారికి నా కృతజ్ఞతాభివందనాలు.

ముఖ్యంగా, ఈ పుస్తకాల అచ్చుకు ఆర్థిక సహాయం చేసిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారికి నా కృతజ్ఞతలు.

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి
(బుజ్జాయి)



"నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి!"

ప్రవాసము



# భూమిక

"ఆధునికాంధ్ర సాహిత్యంలో అసాధారణ ప్రతిభావంతుడైన రచయిత శ్రీ కృష్ణశాస్త్రి. అట్టివారి రచనలు లోకానికి త్వరగా సమగ్రంగా అందాలి. ఆ ప్రయత్నంలో సంకీర్ణ వ్యాసాలు, సాహిత్య ప్రసంగాలు, యక్షగానాలు, శ్రవ్య నాటికలు, గేయాలు, ఖండకావ్యాలు క్రమంగా ప్రకటితం కావడం ఆంధ్ర సాహిత్య ప్రియులకు ఎంతైనా హర్షదాయక మనుకుంటాను" అన్నారు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, 1-10-65 న విశ్వోదయ ప్రచురణలకు 'రెండు మాటలు' వ్రాస్తూ. ఆ నాటి ఆయన ఆశయం సుమారు రెండు దశాబ్దాల అనంతరం అయినా నేడు కార్యరూపం ధరిస్తూంది. శ్రీ కృష్ణశాస్త్రి సాహితి 17 సంపుటాలుగా ఆంధ్రలోకానికి అందించబడుతూంది. అయితే 1975 లో కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవం సందర్భంలో 'కృష్ణపక్షం' పునర్ముద్రణతో సహా ఆరు సంపుటాలలో ఆయన రచనలు కొన్ని మాత్రం వెలువడినవి.

కృష్ణశాస్త్రి వ్యాసావళి నాలుగు సంపుటాలలో రెండు సాహిత్య విమర్శకు సంబంధించినవి. మొదటిది - ఈ 'కవి పరంపర'- విడి విడి కవుల కవితా విశిష్ట లక్షణాలను వివరించేది. రెండోది - 'కవితా ప్రశస్తి' - కవితా తత్త్వ నిరూపణకు సంబంధించినది.

తొలిచి చూసి, లోపల దాగి ఉన్న సౌందర్యాన్ని పెల్లగించి చూచే కృష్ణశాస్త్రిగారి కవిచూపు సునిశితమైన సాహిత్య విమర్శకుని చూపు కూడా అని ఈ 'కవి పరంపర' లోని దిగువ ఉదాహరించిన వాక్యాలు స్పష్టం చేస్తున్నాయి :

> "నన్నయ వైకుంఠాన్ని భూలోకంలో అవతరింపజేస్తాడు; తిక్కన్న భూలోకాన్ని స్వర్గం దగ్గిరికి ఎత్తడానికి యత్నిస్తాడు." - పుట 3

"నన్నయ్య తిక్కన్నలు ప్రయోగించినంత గొప్పగా శబ్దాన్ని ఏ తెలుగు కవీ ప్రయోగించలేదు. వీరి తరవాత రామకృష్ణకవి వస్తాడేమో!" - పుట 5

"శబ్దం పలకడమే కాదు; పాడుతుంది". - పుట 5

"ఏడెనిమిది వంద లేళ్ల నుంచి పల్లెల్లో, పట్టణాల్లో, ఇళ్లల్లో రచ్చ చావళ్లలో ఈ భారతం చదువుకుని పురాణంగా చెప్పి తెనుగు వారు తమ జీవితంలో కలిపేసుకున్నారు. తిక్కన్న రచనలో అంత జీవచ్ఛక్తి, చైతన్యం ఉన్నాయి." - పుట 15

"శ్రీనాథుడు కవుల కవి. అతని తరువాత కవులలో దిగ్గజాలనిపించు కొన్నవారికి కూడా శ్రీనాథుని కవితారీతులంటే అనురక్తి." - పుట 25

"నన్నయ భట్టారకుడు మహారాజగురువు. పెద్దన సార్వభౌముని ప్రాణ స్నేహితుడు. తరువాతి కవులు ప్రభువుగారి ఆశ్రితులో, సేవకులో!" - పుట 27

"మనుచరిత్ర మధువు, భారతం అమృతం." - పుట 28

"కవి చూపు ఇతరుల చూపు వంటిది కాదు. అది ముసుగొత్తిగించి చూస్తుంది; తొలిచి చూస్తుంది. వికారం లోపల దాగి ఉన్న సౌందర్యాన్ని పెల్లగించుకు చూస్తుంది." - పుట 33

"ద్వేషం సృష్టించ లేదు; ప్రేమ సృషిస్తుంది." - పుట 33

"వేమన మాట రెక్క ముడవని భరతపక్షి. కాలాలు దాటి ఇంకా ఎగిరి వస్తూనే ఉంది. వేమన చదువుకున్నట్టే కనబడడు. చదువుల్లో మర్మం మాత్రం ఇతనికి తెలుసు." - పుట 34

"వారు (తిరుపతి వేంకట కవులు) గొప్పకవులు; అయితే పద్య కవిత్వంకన్నా కూడా వారి వచనం గొప్పదని నా నమ్మకం." - పుట 43

"సజీవ విజ్ఞాన సర్వస్వమో, సజీవ వస్తు ప్రదర్శనశాలో ఏదో అన్న మాట పొసగంటి!" - పుట 53

"వంగ భాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్ర మున కీ మహాకవుల, భక్తుల యేకాంత సేవ యట్టి దని నా యభి ప్రాయము.... అసలు మనకు వేంకట పార్వతీశ్వర యుగ మని ఒకటి ఉన్నది." - పుటలు 69, 70

"ఎంతకూ చల్లారని కోరిక లాగ కనబడతాడు నా కెప్పుడూ (బసవరాజు) అప్పారావు - ఊరికే నిట్టూరుస్తూ ఉండే గుండె లాగ!" - పుట 74

"ఆ రోజుల్లో నండూరి గొంతు కొండవాగు. గలగలలూ గంతులూ, సుడులూ వడులూ! ఒక చోట పుట్టి, ఒక దారివి సాగి ప్రవహించి, ఒక చోట కలిసిపోయేది. సుబ్బారావు పాట విభృత సుందరం; అప్పారావు పాట నిసర్గ మనోహరం!" -పుటలు 76, 77

"ప్రపంచ కావ్య భాండారంలో గొప్ప పంక్తుల్లో ఇదొకటి - 'ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయాడు!' (బసవరాజుది) - పుట 82

"ఈ లోకంలోనూ లేదు, శబ్ద లోకంలోనూ లేదు అస్పృశ్యత అనేది. పనికిరాని పద మంటూ ఏముంది?" - పుట 99

"ఒక్కొక్కప్పుడు (నండూరి) సుబ్బారావును బర్న్స్‌తో పోల్చా లనిపిస్తుంది. ఈ గేయ కర్త లిద్దరికీ కవితా ధోరణిలోనే కాదు, లోకాన్ని తృష్ణతో చూసే ఆ పెద్ద కళ్లూ, చూపుల్లోనూ సామ్యం ఉందనిపిస్తుంది." - పుట 100

తెలుగులో ఆరంభంనుంచీ కవులే సాహిత్య విమర్శకులు. "విశ్వ శ్రేయః కావ్యమ్" - జగద్ధితమే కావ్య ప్రయోజనం- అన్న నన్నయ గారి దగ్గరనుంచీ ప్రతికవీ తన కావ్యావతారికల్లో, సుకవి స్తుతిలో,

కుకవి నిందలో తన కవితా సిద్ధాంతాన్ని ప్రవచిస్తూనే వచ్చాడు. ఆధునికుల్లో అలాంటి 'కవి - విమర్శకులు' (poet - critics)- ఇంగ్లీషులో మాథ్యూ ఆర్నాల్డ్, టి. ఎస్. ఇలియట్ లాంటివాళ్లు- తెలుగులో రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ.

కవిగా, వక్తగా, భావకవితోద్యమ జయస్తంభంగా, భక్త కవిగా, సినీకవిగా శ్రీ కృష్ణశాస్త్రిని గుర్తించినంతగా సాహిత్య విమర్శకుడుగా ఆయన్ని లోకం గుర్తించినట్టు తోచదు. పాతిక ముప్ఫయ్యేళ్ల క్రితమే, దేశంలో నవ్య సాహిత్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లోనే ఆయన చేసిన ఈ రేడియో ప్రసంగాలు ఇంతవరకూ గ్రంథరూపం దాల్చక పోవడమే ఇందుకు కారణం. ఆ లోపం పూరించడం కోసం చెదురు మదురుగా ఉన్న శాస్త్రిగారి సాహిత్య విమర్శక రచనల్ని ఒక క్రమంలో అమర్చి ఈ రెండు సంపుటాలూ కూర్చబడినవి.

లేఖక ప్రమాదాల్నీ, అర్థభంగం ఏర్పడుతున్న సందర్భాల లోనూ స్వల్పంగా సవరించడం తప్ప శ్రీ శాస్త్రిగారి రచనా శైలిని యథాతథంగా పాఠకులకి అందజేయడానికే మేము ప్రయత్నించాము. ఉదాహృత పద్యాల, పద్యపాదాదుల ఆకరాలు మేము గుర్తించ గలిగి నంతవరకు చివర అనుబంధంలో ఇచ్చాము.

శ్రీ శాస్త్రిగారి అముద్రిత రచనల్ని ప్రచురించడానికి తల పెట్టిన ఈ మహాయజ్ఞంలో అధ్వర్యులుగా ఉండి, 'కృష్ణశాస్త్రి సాహితి'కి యథాశక్తి సేవ చేసే అవకాశం మాకు కలిగించిన 'రాజ హంస ప్రచురణల' అధిపతి చిరంజీవి దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి (బుజ్జాయి)కి మేము కృతజ్ఞులం.

సంపాదకులు

# ఆస్వాదానికి ఆహ్వానం

ఇక్షు సముద్రం ఎక్కడుందో నాకు తెలియదు. కాని, ఆపాత మధుర మయిన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షు రసార్ణవమే. కృష్ణశాస్త్రి పలుకుల్లోని చెరుకు తీపి సాహిత్యరస పిపాసువులకు ఎక్కడో ఉందనుకొనే ఇక్షుసముద్రాన్ని వెదుక్కోవలసిన అగత్యాన్ని తొలగిస్తుంది.

అందుకే పురాణాల్లో పేర్కొన్న ఇక్షు సముద్రం ఎక్కడుంటుందో దాని జాగ్రఫీ జోలికి వెళ్లదలచుకోను నేను. మన యెదుట నిజంగా కృష్ణశాస్త్రి సాహిత్య సమస్తమూ ఉరకలూ పరుగులుగా ఉప్పొంగుతోంది. ఇదే అసలు సిసలయిన చెరుకు రసాల కడలి. ఆస్వాదించుదాం రండర్రా అని అందర్నీ ఆహ్వానిస్తున్నాను.

ఒకప్పుడు కృష్ణశాస్త్రి కవిత్వం మాత్రమే మాధుర్య 'మా' ధుర్య మనుకున్నాము. ఇప్పుడు మీ చేతిలో ఉన్న పుస్తకాన్ని చూడండి. ఇంకా అచ్చవుతున్న, లేదా అయి, సిద్ధంగా ఉన్న సంపుటాల్ని చూడండి. అప్పుడు మాధుర్యం అంటే ఏమిటో మీకే అర్థం అవుతుంది. అప్పుడు వాస్తవంగానే ఒక ఇక్షుసముద్రంలో మీరు ఓలలాడుతారు.

కాని, ఇక్కడో చిన్న విశేషం ఉంది. తినగ తినగ వేము తియ్యనుండు నేమో కాని అంతా చెరుకు రసమే అయితే మొగం మొత్తేస్తుంది. అందుకే కృష్ణశాస్త్రి చెరుకు

సముద్రంలో అక్క డక్కడ మిరియాల పొడి ఉంది. కరక్కాయల కసటుదనం ఉంది. ఇంకా మీరు కోరుకొనే ఎన్నెన్నో మసాలా లున్నాయి.

ఇప్పుడు నా మనస్సు 50 సంవత్సరాల వెనక్కి పోతోంది. 1920 ల ప్రారంభ దినా లవి. ఆ రోజుల్లోనే జమీందారీ కవిత్వాన్ని తోసి రా జని భావకవిత్వం రంగ ప్రవేశం చేసింది. 1910 - 20 ల మధ్య ఈ ఉద్య మాన్ని ప్రారంభించిన వారు రాయప్రోలు, అబ్బూరి. అయితే దీనికి 20 లలో అఖిలాంధ్ర ప్రాచుర్యం ఇచ్చిన వాడు కృష్ణశాస్త్రి. బరంపురం నుంచి బళ్ళారి దాకా ఈయన తనవీ, ఇతరులవీ భావగీతాల కవితాగానం చేస్తూ యువతరాన్ని ఆకట్టుకున్నాడు.

అయితే కృష్ణశాస్త్రిది ప్రతిఘటన లేని విజయయాత్ర కాదు. మహాపండితు డయిన అక్కిరాజు ఉమాకాన్తమ్ "నేటి కాలపు కవిత్వం" అనే పుస్తకం రాసి, అందులో ఎక్కువ భాగం కృష్ణశాస్త్రినే వెక్కిరించాడు. ఉమా కాన్తమ్ (సంస్కృతపు స్పెల్లింగు చూడండి!) గారికి సంస్కృతంలో తప్ప మరెక్కడా కవిత్వం కనబడదు. నన్నయభట్టును కూడా ఆయన కవిగా ఖాతరు చెయ్య లేదు. నేటి కాలం కవిత్వానికి కాలం కా దనేశా డాయన.

కాని, ప్రపంచం మాత్రం వేరు విధంగా భావించింది. భావకవిత్వాన్ని ఆ నాటి ప్రధాన శాఖగా గుర్తించింది. ఈ శాఖ ఎన్నో కోకిలలకు ఆశ్రయం ఇచ్చింది. (గౌతమీ కోకిలగా పేరు పొందిన వేదుల సత్యనారాయణ శాస్త్రిని

ఇక్కడో చిన్న ఉదాహరణగా ఉటంకించ వచ్చును.) ఈ అన్ని కోయిలల్లో అగ్రస్థానం సాహిత్య విమర్శకు లంతా కృష్ణశాస్త్రిదే అని అంగీకరించారు.

"నేటి కాలపు కవిత్వం" ఇప్పుడు లైబ్రరీలలో బూజు పట్టిపోతోంది. కృష్ణశాస్త్రి కవిత్వం భావకవితకు పరాకాష్ఠగా నిలబడింది.

అనంత పంతుల రామలింగస్వామి అనే ఆయన "కృష్ణ పక్షం" కావ్య సంపుటిని వేళాకోళం చేస్తున్నా ననుకుంటూ "శుక్లపక్షం" అనే రాతని వెలువరించాడు. దాన్ని కూడా ఇప్పుడు చదివే వాళ్లెవరూ లేరు. ఆ రోజుల్లోనే దాన్ని వేదుల "ఈ శుక్లపక్షం సారస్వతారిష్టం అనే శుక్లనష్టం" అని చెప్పి సహృదయుల హృదయ ఫలకాల నుంచి తుడిచిపెట్టి పారేశాడు.

1930 లలో భావకవిత్వం మీద తిరుగు బాటుగా అభ్యుదయ కవిత్వం వచ్చింది. కాలంతో పాటు ఎదుగుతున్న కృష్ణశాస్త్రి అభ్యుదయ కవిత్వాన్ని ఆహ్వానించి ఆశీర్వదించాడు. అంతే కాదు. అభ్యుదయ రచయితల సంఘం వార్షికోత్సవాలలో ఒకదానికి అధ్యక్షత వహించాడు.

సినీమా రంగంలో ప్రవేశించి, మళ్లీ ఇలాంటిది రావడానికి వీల్లేదన్నట్టుగా మల్లీశ్వరి రాశాడు.

ఈ మధ్య కాలంలో ఆయన యెన్నో రేడియో నాటకాలు రాశాడు. రేడియో ప్రసంగాలు చేశాడు.

ఆ తర్వాత ఆయన గొంతుక పోయింది. కాగితాలమీద (చిన్న చిన్న నోటుబుక్కుల మీద) అక్షరాలు రాస్తూనే, తన దగ్గరకు వచ్చిన అందరితోనూ ప్రసంగించాడు. ఎన్నో ట్రంకు పెట్టెల నిండా ఈ నోటుబుక్కు లున్నాయని బుజ్జాయి (కృష్ణశాస్త్రిగారబ్బాయి) నాతో చెప్పాడు.

ఒక దానిలో కృష్ణశాస్త్రిగారు నామీద ఇలా రాశారట: "శ్రీ శ్రీ గొప్పకవి. అతని మీద ఈగ వాలినా నేను సహించలేను" అని!

నా మీద వారి కెప్పుడూ సదభిప్రాయమే ఉంది. మరి వారి మీద నాకు వల్లమాలినంత అభిమానం. నా మనస్సు మీద చెరగని ముద్రలు వేసిన ముఖ్యాతి ముఖ్యులలో కృష్ణశాస్త్రిని ప్రముఖంగా పేర్కొంటాను.

వారి మీద నా కున్న అభిమానం, అపేక్ష వారి యీ గ్రంథ సంపుటాలకు గాను ఈ రాత రాయడానికి ప్రేరేపించాయి. మరోమారు చెబుతున్నాను. ఇది ఇక్షు సముద్రం. "అందరం ఆస్వాదించుదాం, రం"డని ఆహ్వానిస్తున్నాను.

మద్రాసు,
29-11-81

శ్రీ శ్రీ

# నన్నయ భట్టారకుని అమరవాణి

'నా అభిమాన కవి ఎవరు?' అని అడిగితే నన్నయ భట్టారకులు అని చెప్పడము 'నీ ఆప్తమిత్రు లెవ' రని అడిగితే నా తండ్రిగారు అని చెప్పడం లాంటిదే. తండ్రిని వేరే ఆప్తుడనీ, అభిమానుడనీ అనడ మెందుకు ? ఏ ఆంధ్రకవికైనా పూజ్యులలో పూజ్యతముడు, ఇష్టులలో ఇష్టతముడు నన్నయ. ఆంధ్ర కవి కుటుంబానికి నన్నయ 'కుల బ్రాహ్మణుడు, అనురక్తుడు' - రాజ రాజనరేంద్రునకు లాగే. 'ఆంధ్ర కవిత్వ విశారదుడూ, విద్యాదయితుడూ, మహితాత్ముడూ' అయిన నన్నయభట్టుమీద తిక్కన సోమయాజికి ఎంతటి ప్రపత్తి!

తిక్కన అనుచరులలో పింగళి సూరనాదుల వంటివారు వేళ్ల మీద లెక్కపెట్టదగిన వారు ఏ కొద్దిమందో! ఆంధ్ర కవు లందరూ నన్నయ అనుయాయులే. 'గురూణాం గురుః ప్రాభాకరః' అన్నట్టు 'కవీనాం కవిః' నన్నయభట్టు. ఇలా అన్నప్పుడు ఆయన కవులకే కమనీయుడు కాని, జనసామాన్యానికి కాడని కాదు. "సారమతిన్ కవీంద్రులు ప్రసన్నకథాకలి తార్థయుక్తి లో నారసి మేలు నా, నితరు లక్షర రమ్యత నాదరింప నానా రుచిరార్థ సూక్తినిధి"

నన్నయభట్టు. ఆయన కవితా వాహిని "పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణపుంజ వారిజోత్కర రుచిరము", "మహా మనోహర సుచరిత్ర పావన పయః పరిపూర్ణ"మే కాక, "సకలగమ్య సుతీర్థము" కూడాను. అది గంగానది. అది మూడు లోకాలకూ ముక్తాహారమే కాక పాతాళము నుంచి పరమపదము దాకా నిశ్శ్రేణిలాగ నాకు కనపడుతుంది.

అసలు మహాభారతంలోనే ఆ గుణం ఉంది. మలినాతి మలినము లైన మానవగాథలు మొదలుకొని ఉజ్జ్వలాత్యుజ్జ్వలములైన ఉత్తమ చరిత్రములదాకా దానిలో చిత్రితములై ఉన్నాయి. ఇక నన్నయ్య ఎట్టి పాప పంకిలమైన విషమ విషయం తీసుకున్నా, తన ప్రతిభా నఖాలతో దాన్ని ఒడిసిపట్టి అంతరిక్షాని కెగిరి, ఆకాశ గంగలో అతి శుభ్రం చేసి, అమరం చేసి, ఆనందమయం చేసి, మన ఎదుట మెరి పిస్తాడు. అంతేకాదు. నన్నయ్య భారతలోకంలోని వారందరూ సగం దివ్యులు. వాళ్లు మామూలు సమస్యలతో మానవులుగానే మనల్ని పలకరిస్తూ, పలుకుతూ, పనిచేస్తూ మన మనస్సులనూ హృదయా లనూ ఒక్కసారి వశపరుచుకుని, అంతలో హఠాత్తుగా ఆదికాలాలూ, హస్తినాపుర వీథులూ, ఆశ్రమవాటికలూ, అనంతసాగరాలూ, ఆకాశ దీపాలూ స్ఫురింపజేస్తారు.

తిక్కన మహామంత్రి ; మంచి వాస్తవికుడూను. ఆయన భారత లోకం లోని వారి కందరికీ అస్థిమాంసాదు లెక్కువ ; అక్కడ ఎంత సేపూ ఈ లోకమూ ఈ సంఘటనలూ ఈ సమస్యలూ ఈ నవ్వులూ ఈ ఏడ్పులూ–వీటిమధ్యనే ఉన్నట్టు ఉంటాము. అంటే నన్నయ ఈ లోకాన్నీ, ఇహలోక సమస్యలనీ చూడనివా డని కాదు ; వదలిన వాడు కాడు. గొప్ప లోకజ్ఞుడు నన్నయ.

ఆయన ఏమంటా డంటే - "అవును మీరు ఇలాగ ఉన్నారు. ఇటువంటి చిక్కుల్లో ఉన్నారు ; కనుకనే మీకోసం మీకు లక్ష్యంగా

మీకు కడపలగా ఈ అమరలోకాన్ని దింపాను ; అవలోకించండి, ఎంత బాగుందో ! ఈ లోకం అలాగ అవాలి !" అని.

తిక్కన ఏమంటా డంటే :

"అబ్బ! మీరు ఇలాగ ఉన్నారు; ఇటువంటి చిక్కుల్లో ఉన్నారు; ఇవన్నీ మీరు ఈ పద్దతుల్లో కృషిచేసి విడదీసుకోవాలి. ఒక కొత్తలోకం సృష్టించుకోవాలి !" అని.

నన్నయ ఎక్కువ ప్రాచ్యుడు ; తిక్కన్నకు కొంత పాశ్చాత్య ధోరణి ఉంది. నన్నయ వైకుంఠాన్ని భూలోకంలో అవతరింప జేస్తాడు. తిక్కన్న భూలోకాన్ని స్వర్గం దగ్గిరికి ఎత్తడానికి యత్నిస్తాడు. ఒకరిది ఎక్కువగా దూరదృష్టి ; రెండవ వారిది ఎక్కువగా తీక్ష్ణదృష్టి. ఒకరిది ఎక్కువగా సమ్యగ్దృష్టి ; రెండవ వారిది ఎక్కువగా వివేచనాదృష్టి. ఒకరు గురుదేవులు ; రెండవవారు సచివోత్తములు. ఒకరు ధౌమ్యులు, రెండవవారు విదురుడు. ఇద్దరూ కలసి శ్రీ వేదవ్యాసులు. ఇద్దరిలోనూ ఈ రెండు గుణాలూ ఉండవచ్చును ; ఇద్దరి మహా లక్ష్యమూ ఒక్కటే కూడాను - జగద్ధితము.

నన్నయదృష్టి ఎంతసేపూ మరీ పూర్వకాలంలోకి పూర్వ లోకంలోకి పోతుంది ; అందుకే మరీ భావికాలంలోకి లోకంలోకి పోగలదు. ఆయనకు పూర్వయుగమే స్వర్ణయుగమూ, స్వర్గ యుగమూ. ఆయనకి తెలుసును - నిజానికి మరీ పూర్వకాలమే భావికాలానికి దగ్గిరగా ఉన్నదని. ఆయనకి తెలుసును - ద్వేషమూ, రోషమూ, మోసమూ, నాశమూ, అసంతృప్తీ, అశాంతీ- అన్నింటినీ అధిగమించి, ఈ లోకం మళ్లీ తపోవనం దగ్గిరికీ, రామరాజ్యం దగ్గిరికీ ప్రయాణం చెయ్యాలని ; చేస్తూందని.

ఆయన 'లోకజ్ఞుడే' కాక 'పరలోకజ్ఞుడు' కూడా ! కనుక

ఆయన గొప్ప ఆశావాది. ఆయన లోకంలో దిగులు పడిపోము; అలసి పోము; యుద్ధానంతరం పాలికలనిలో లాగా విదికిపోము; స్వర్గారోహణం చేస్తూ కూడా కొంత అసంతృప్తితో కొన్ని కోరికలతో కొంత వేదనతో మిగిలిపోము. కేవలము వాస్తవికులలో కొంతవరకు నిరాశ ఉండదూ? ఎంతమాత్రమూ వాస్తవికులు కాని వారిలో శక్తి లేనట్టు! "సంపతదళినీ నినాద మృదుభాషల దీవన" లిచ్చుచు "మృదు లాని లాపవర్జిత కుసుమాక్షతావళుల సేసలు" వెట్టు లతా లలనలతో, "ఆజ్య హవిర్భృత సౌరభ ధూమ లతాతతులం బెనగిన మ్రాకుల కొమ్మలమీద నపేత లతాంతము లైనను బాయని మధుప ప్రకరంబుల" తో —

"శ్రవణసుఖంబుగా సామగానంబులు
 చదివెడు శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులును, గరికర
 శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణముల చల్లని గాడ్పానపడి వానిఁ
 జెంది సుఖం బున్న సింహములును,
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
 పెట్టు నీవారాన్న పిండతతులు
కడగి భక్షింప నొక్కట గలసి యాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొందు సహజ
వైరి వర్గంబులయు సహవాస"ముతో,

పరమ శాంతి ధామములైన ఆశ్రమాలలో బ్రహ్మర్షులూ, "సమస్తాశాంత మాతంగ మర్యాదాలంకృతమైన భూవలయము.... రుజాశోకాతంక, క్షయ శంకాపేత"ముగా, "ధర్మమును ధృతియు, సత్యము, కారుణ్యమ్ము" ను తమకు వశమై కొలువగా రాజ్యాల నేలు సమ్రాట్టులూ నిండి ఉన్న అమర సుందరలోకాన్ని

చిందులాడే జీవంతో, చైతన్యంతో సృష్టించి పాంచజన్యంలాంటి కంఠస్వరంతో కాశీపటంలో లాగ ఆయన ప్రకటిస్తాడు.

కనుక అంత సుదూర సీమలను ఎంత సుస్పష్టంగా చూసేడో అంత సుస్పష్టంగానూ సుందరంగానూ సృష్టించ గలిగిన నన్నయ్యది సామాన్య కవితాశక్తి కాదు. మామూలు విషయం చెప్పడానికి మామూలు మాటలు చాలును; మామూలు విషయాన్ని మించినదాన్ని వర్ణించడానికీ, అసలు భావాలను మించిన అనుభవాన్నీ పరమార్థాన్నీ చిత్రించడానికీ, సామాన్య శబ్దాలు ఒక్కొక్కప్పుడు చాలవు. ఇక ఆ మాట లయినా మామూలు కలయికలో, కూర్పులో చూపవలసినంత శక్తి చూపలేవు. అందుకే ఛందస్సు.

నన్నయ్య తిక్కన్నలు ప్రయోగించినంత గొప్పగా శబ్దాన్ని ఏ తెలుగు కవీ ప్రయోగించలేదు. వీరి తర్వాత రామకృష్ణకవి వస్తాడేమో! తిక్కన్న ప్రతి శబ్దాన్నీ ఎంతవరకు ఉచితంగా పనికి వస్తుందో తూచి తూచి ఉపయోగిస్తాడు - ఒక ప్రయోగం (experiment) చేసేటప్పుడు ఒక మహాశాస్త్రజ్ఞుడు (Scientist) ఒక్కొక్క పదార్థాన్నే దాని విలువ గ్రహించి ఫలితానికి ఎంత వరకు పనికివస్తుందో చూసి ఉపయోగించినట్టు. శబ్దానికి ప్రాణమే కాదు పక్షాలూ ఉన్నాయి. ఒక శబ్దాన్నీ మరొక శబ్దాన్నీ ఒక ధోరణిలో కలిపి, ఒక విలక్షణమైన గానం పుట్టించి, దాని రెక్కలమీద కూర్చోబెట్టి, ఎట్టి దూరానుభవాలనైనా అందజేసి, ఎట్టి దూరలోకాలనైనా కనపరచి విహరింప జేస్తూ ఇంకా వెనకాల నున్న వేవో స్ఫురింపజేసే శక్తి ఒకటి ఉంది. అది నన్నయ్యది. శబ్దం పలకడమే కాదు; పాడుతుంది.

పాటకు ఒక శక్తి ఉంది. మాటల కందని వాటిని చెప్పుతుంది. ఏ అనుభవమైనా తన్మయత్వం దాకా తీసుకొని పోయేటప్పటికి

మనం దానిని వ్యక్త పరచడానికి సంగీతాన్నో, దాని అభాసాన్నో సాయంగా తీసుకుంటాము - దుఃఖంలో వివశులమైనప్పుడూ, భక్తితో ఊగిపోతూన్నప్పుడూ లాగ. ఇక మహాకవికి మామూలు దృశ్యాలను మించినవి సాక్షాత్కరిస్తాయి గదా! మామూలు ఆవేశాలని మించినవి ఊగిస్తాయి గదా! వాటిని ప్రకటించడానికి సామాన్య శబ్దాలూ, ఎక్కడెక్కడి మాటలూ ఏరి తెచ్చి వాటిని రకరకాల కూర్పుల్లో పెట్టి, చిత్ర చిత్రాలుగా నడిపించి, ఒక వింతగానం పుట్టించి, తనకు సాక్షాత్కరించిన దాన్ని మనకు కూడా ప్రత్యక్షం చేయడానికి ఆయన ప్రయత్నిస్తాడు. ఈ శక్తి నన్నయ్య కున్నట్టు ఆంధ్ర కవులలో ఎవరికీ లేదు. ఆయన కవిత ఒకసారి భాద్రపదంలో భాగీరథిలాగా ప్రవహిస్తుంది; ఒకసారి హస్తినాపుర రాజవీధిలో మత్త మాతంగం లాగా నడుస్తుంది; ఇంకొకసారి హవిర్ధూమ లతాగ్రంలాగా లాస్యం చేస్తుంది; మరోసారి జ్వలన శిఖాలీ, నరుని నద్వి శిఖాలీ కలిసినట్టు ఫెటపెటమనీ, ఫెళఫెళమనీ ఎగిరి పడుతుంది. ఎన్ని ఉదాహరణలని ఇయ్యగలం - ఏ పద్య మెత్తినా అలాగే ఉన్నప్పుడు!

"వివిధోత్తుంగ తరంగ ఘట్టన
    చలద్వేలా వనైలావలీ
లవలీ లుంగ లవంగ సంగత
    లతా లాస్యంబు లీక్షించుచున్" అంటాడు.

"జలధి విలోల వీచి విల
    సత్కల కాంచి సమంచి తావనీ
తల వహన క్షమం బయిన
    దక్షిణ హస్తమునన్" అంటాడు.

"సాగర సార హారిరుహ
    శౌక్తిక మౌక్తిక విద్రుమ ద్రుమై

లాగురు చందనంబులు ప్రి
   యంబున నిచ్చిరి తెచ్చి - యున్నత
శ్రీగుణ యుక్తమై బరగు
   సింహళ కేరళ చోళ పాండ్య దే
శాగత రాజపుత్రులు."

"మందిత సూర్యరశ్మి రుచి
   మన్మణిహార చయంబుతో కటి
స్యంది సుగంధి దానజలసంపద
   నొప్పెడు వాని" అంటాడు.

"ఉరుతర దావపావక శి
   ఖోత్కలిత శ్వసనంబులున్ సితే
తరగతి తీవ్ర తిగ్మకర
   ధామ సహస్రములున్ బహు ప్రవా
హ రహిత నిమ్నగాతతులు
   నై కడు దీర్ఘములై నిదాఘ వా
సరములు" అసహ్యము లైనప్పుడు-

"- - - - - - - - ఉన్మిష
న్నలినరజ స్సుగంధి యము
   నా హ్రద తుంగ తరంగ సంగ తా
విల శిశిర స్థలాంతర వి
   నిర్మిత నిర్మల హర్మ్య రేఖలన్"

విహరింపజేస్తాడు.

ఈ శక్తి అన్ని ఘట్టాల్లోనూ కనబడుతుంది. శకుంతలకథ, దేవయానికథ, శర్మిషకథ, తపోవనమూ, వసంతర్తువూ, మాద్రీ

సౌందర్యమూ, కౌరవ పాండవుల యౌవనక్రీడలూ, ఖాండవ దహనమూ, గరుత్మంతుని గాథా, వసిష్ఠుని గాథా, రాజసూయమూ, మయసభా, శిశుపాలవధా, జూదమూ, భీమసేనుని ప్రతినా, శరద్రా త్రులూ – ఎక్కడయినా ఈ దివ్యప్రతిభ కచ్ఛపి కంఠస్వరంతో గానం చేస్తుంది. ఆంగ్ల కవులలో మిల్టన్‌ది మహా కావ్యం (epic) ఆలపించే organ voice అన్నారు. నన్నయ్యదీ అంతే. అంతేకాదు ; ఏదో అపూర్వ శక్తిచే ప్రేరేచబడిన వాణి ఆయనది.

దీనికి తోడు మరొక గొప్పగుణం ఉంది – నన్నయ్య కవితలో. అది సంయమం (restraint). ఇంకో కవి వచనంలో చెప్పేది ఈయన పద్యంలో చెప్తారు. ఇంకో కవి పద్యంలో చెప్పేది ఈయన వచనంలో చెప్తారు. "విలసత్కూలఘనవల్లి యన్నిష్టసఖి నూది యున్న దాని" అని నూతిలోపడ్డ దేవయానిని వర్ణిస్తాడు ; అంతే ! కూలవల్లి నూదియున్న సుకుమారి ఎంత సోయగంగా ఉంటుందో మన భావనకి స్ఫురిస్తుంది.

అసలు నన్నయ్య యుగంలో మన ఆంధ్రజాతి యువస్థితిలో ఉంది. బాల్యం చలిస్తుంది, కదలిక ఎక్కువ. వార్ధక్యం మన్నా, మననం ; కదలనే కదలదు. యౌవనం ధృఢం, సుందరంగా నడు స్తుంది ; పలుకుతుంది. యౌవనం తనదృష్టిని ధ్రువ నక్షత్రానికి తగి లించి ప్రయాణం చేస్తుంది. యౌవనానికి ఒక లక్ష్యం, ఒక కడపల ఉంటుంది. ఆంధ్రజాతి అప్పుడు స్వతంత్రజాతి. స్వాతంత్ర్యంలేనిదే ప్రాణం లేదు. ప్రాణమున్నదే నడిచినా, పలికినా, పాడినా ! నన్నయ్య రోజుల్లో ఆంధ్రజాతి బ్రతికిపోవడమేకాదు. స్వతంత్ర శక్తితో నిలబడి ఉంది. మన జాతిలో నన్నయ్య తిక్కన్నల ముక్తకంఠంలో నుంచి వచ్చిన ఉదారవాణి వంటిది ఇంకా ఎలాగ వినపడుతుంది ?

— మొదట రేడియో ప్రసంగంగా ప్రసారితం ; అనంతరం ఆంధ్రప్రభ ఆదివారం సాహిత్య గోష్ఠిలో ప్రకటితం.

# తిక్కన ప్రతిభ

తిక్కన - ప్రపంచంలో మీ ఇష్టం వచ్చిన భాషలో మొదటి కవిని తీసుకోండి – అతని ప్రక్కని నిర్భయంగా కూర్చోపెట్టదగ్గ వాడు.

ఒక్కొక్క కవి ఒక్కొక్క కాలంలో పుడతాడుకదా! ఆ కాలంలో ఆ దేశమూ, ఆ దేశంలో జనమూ, వారి ఆచారాలూ, ఆలోచనలూ, కష్టసుఖాలూ ఒక్కలా ఉంటూ ఉంటాయి. ఇంకో సమయంలో ఇంకోలా ఉంటాయి. కవి అలాంటి జనంమధ్య ఉంటాడు. అంటే, అతనిమీాద కూడా ఆ దేశమూ, కాలమూ ప్రభావం బాగా పడుతుంది. అందుకనే ఇప్పటి కవులకీ వారి వ్రాతలకీ, నూరేళ్లక్రితం కవులకీ వారి వ్రాతలకీ అంత తేడా ఉంది. కనుక తిక్కన రోజులూ, అప్పటి తెలుగుదేశమూ, సమాజమూ, వాటి అనుభవాలూ ఆ మహా కవిని కూడా పలకరించి ఉంటాయి.

తిక్కన నెల్లూరి వాడు. అక్కడి రాజు మనుమసిద్ధి రాజ్యం పోవడం, తిక్కన ఓరుగల్లు వెళ్లి ప్రభువు సాయంతో మళ్లీ రాజ్యం సంపాదించడం, కాకతీయ సామ్రాజ్యం అవసానదశలో ఉండి, విజయనగర సామ్రాజ్యం ఇంకా ఏర్పడక, దక్షిణదేశం – ముఖ్యంగా తెలుగునాడు ముక్కలు ముక్కలుగా అయిపోయి

అల్లకల్లోలంగా ఉండడం, ఈ పరిస్థితుల్లో పాండవకౌరవుల అసూయలూ పోట్లాటలూ, వారి వారి రాజ నీతి - ఇవన్నీ కావ్యవస్తువులుగా తీసుకొని భారతం రచిస్తే, రక రకాల సమస్యల్లోనూ, చిక్కుల్లోనూ ఊపిరాడని తెలుగువారికి ఒక గొప్ప మార్గం, చివర నొక లక్ష్యం చూపించడం అవుతుం దేమో అని తిక్కన అనుకున్నాడేమో! అయితే ఈ పని సామాన్య మైన పని కాదు. భారతం మహాసముద్ర మాయెను. అందులో నన్నయ్యగారు దాటింది ఏ నాలుగు మైళ్లో. రెండో తీరందాకా ఈదవలసిన వాడు తిక్కన. ఈ పనికి ఎంత దీక్ష, ఎంత ఆవేశం కావాలి!

కవి జీవితానికీ, కావ్య సృష్టికీ కూడా చాలా సంబంధం ఉంది. కవి జీవితం ఎంత ఎత్తుగా ఉంటే అంత తేలికగా కల్పనా కైలాసం మీదికి ఎగర గలడు. అది ఎంత లోతులో పడి ఉంటే, ఆ బురదలోంచీ, ఆ చీకటిలో నుంచీ పైకి ఎగరడం అంత కష్టం. తిక్కన మొదట నిర్వచనోత్తర రామాయణం వ్రాసేడు. దానిలో ఆయన గొప్పతనం సూచనలు కొన్ని కనపడతాయి. కాని, భారతసముద్రం దాటేముందు ఆయన సోమయాజి అయాడు. ఆంధ్రకవిత్వ దీక్షా విధి చేపట్టాడు. అనగా తన జీవితమూ, శక్తులూ అన్నీ భారత రచన వైపే తిప్పేసే డన్నమాట. ఇది సామాన్యకవికి సాధ్యమయ్యే పని కాదు.

సాధారణంగా ఒక గొప్పవాణ్ణిగూర్చి విన్నప్పుడు, అతని పనుల్ని గూర్చి తెలుసుకున్నప్పుడు, అత నెలా ఉంటాడో చూడా లని ఉండదూ? ఎప్పుడో పోయినవా డైతే ఎలా ఉంటాడో భావించా లని ఉండదూ? భావించుకున్న రూపానికీ, నిజానికీ సంబంధం ఉండక పోవచ్చు. నా కంటికి తిక్కన్నగారు పొడుగ్గా ఉంటాడు. శరీర ఛ్ఛాయ దబ్బపండులా ఉండొచ్చు. కోటేరు వేసిన ముక్కు, విశాలమైన నుదురు, బల మైన గడ్డం, రాజాస్థానానికి వెళ్ళే టప్పుడు -

బిళ్లగోచీ పంచె, ముల్లా అంగరఖా, శుభ్ర సుందరా లైన వస్త్రాలు, నుదుటిమీద గంధాక్షతలు. ఇంక అన్నింటికంటె గొప్పవి ఆ కళ్లు! ధగధగా కత్తిమొనల్లాగ వాడిగా మెరుస్తూ చల్లని అనురా గంతో నిండి ఉంటాయి సూర్య చంద్రుల్లాగ. కవి విగ్ర హాన్ని గురించి ఎందుకూ ఈ మాటలు - అని అడుగుతారా? కాని, కవిని తెలుసుకోడంలో ఇది కూడా ముఖ్య మని నా అభిప్రాయం.

ఇంతకూ ఆయన కావ్యం చదివాక కదా ఈ మూర్తి కట్టు కున్నాం. నిజంగా భారతం చదివితే మనకు మొట్టమొదట స్ఫురిం చేవి ఇవి రెండు: నిశితాతి నిశిత మైన ఆయన మేధా, లోక మంత విశాల మైన ఆయన హృదయం. అంటే, అన్ని ప్రకృతుల వ్యక్తుల్నీ, మనుష్యుల్నీ దగ్గిరగా తీసుకుని మంచిచెడ్డలు చూస్తూనే విమర్శిస్తూనే సానుభూతి చూపెట్టడం. ఇవే ఆయన్ని గొప్ప నాటక కర్తను చేసేయి.

తిక్కన్న అన్ని రకాల మనుష్యుల్నీ చూసేడు. లోపల లోపలికి వాళ్ల తత్త్వాల్లోకి పెళ్లగించి చూసేడు. వాళ్లని అన్ని రకాల పరిస్థితు ల్లోనూ, సంఘటనల్లోనూ చూసేడు. చాలా ఇష్టంతో చూసేడు. ఏ వ్యక్తి ఏ పరిస్థితుల్లో ఎలా మాట్లాడుతాడో, ఏం చేస్తాడో అతనికి సరిగ్గా తెలుసు. కనుక పాండవులూ, కౌరవులూ, మిగిలినవాళ్లూ ఆయన బాగా ఎరిగున్న మనుష్యులే అయిపోయారు. వారి కొచ్చిన కష్టసుఖాలు ఎలాంటివో ఆయనకు తెలుసు. అంచేత కౌరవ పాం డవులగాథ పెద్ద నాటకంగా మన ఎదుట ఆడించేసేడు. ఆ ప్రదర్శ నంలో తిక్క న్నెక్కడా కనబడడు, వినబడడు. ఇది కవి కెంత కష్ట మైన పనో తెలుసునా? తన్ను తాను పూర్తిగా లేకుండా తుడి చేసుకోవడ మన్నమాట. లోకంలో వాడై కూడా దానిలో లేనట్టు తటస్థుడుగా, ఒడ్డున సాక్షిగా కూర్చోడ మన్నమాట!

మనుష్యలోకాన్ని ఎంత జాగ్రత్తగా చూడాలో కూడా చూడండి. ఒక చిన్న చేయివిసురు, ఒక కంటి ఉరుము, ఒక చిన్న కనుబొమ్మ విరుపు - ఏవీ వదలకూడదు. చూడండి! కోపం వస్తే ఒకడు అరుస్తాడు. మరొకడు గుడ్లతో గర్జిస్తాడు. ఇంకొకడు పళ్లు పటపట కొరుకుతాడు. అర్జునుడు కళ్లు మెరిపిస్తాడు. ధర్మరాజు - వాడి ల్లు బంగారంగానూ! - నిశ్చలంగా, నిర్మలంగా ఉంటాడు. ఆ చల్లని మొహం కింద, ఆ తేట మాట కిందా సముద్రముఖంకింద బడబానలంలా కుత కుత మని ఉడుకుతూనే ఉంటుంది. అలాగే వీరికి అసూయ వచ్చినా. దయ కలిగినా, ప్రేమ పుట్టినా ఈ మార్పులుంటుంటాయి. ఇలాంటి మనుష్యులు ఎందరో అనుకూల ప్రతికూల పరిస్థితుల్లో రకరకాల సంఘటనల్లో భారతంలో మన ఎదుట కనిపిస్తారు. భారతంలో ఏదో పద్యం తీసి చదవండి. ఇది ధర్మరా జన్నదీ, ఇది సంజయు డన్నదీ, ఇది ధృతరాష్ట్రు డన్నదీ- అని చెప్పేసుకుంటాము.

ఒక ఫ్రెంచికవి అన్నాడు: "నాటకం అంటే జీవితమే! జీవితం కంటె గొప్పది మరొకటి లేదు." అంటే నాటకంలో మనుష్యులే రావాలి. వారే తమ తమ గొంతులతో మాట్లాడాలి. వారి వారి పద్ధతుల్లో కోపించాలి, నవ్వాలి, ఏడవాలి. ఈ ధోరణిలో చూస్తే మన తెలుగుభాషలో చూసే నాటకా లన్నీ నాటకాలు కావని తెలియడం లేదూ? ఎందుకు — ఒక చిత్రం చెపుతాను. నన్నయగారి భారతంలోనూ పాండవ కౌరవులు వస్తారు. వా రెక్కడెక్కడో గాని మనం ఎరిగున్న మనుష్యుల్లా కనబడరు. సహదేవుళ్లలా ఉంటారు. వారి కేం? వారి కెవరి క్కోపం వచ్చినా పళ్లు పట పట కొరికి గర్జించొచ్చు. కొండలు అల్లల్లాడి పోవచ్చు. సప్తసముద్రాలూ కలిసిపోవచ్చు. నన్నయ్యగారు చాలా గొప్పకవి; తిక్కన్న చాలా గొప్ప నాటకకర్త.

తిక్కన్న చాలా గొప్ప కవి కూడాను. ఎన్ని రకాలుగా ఇతని శక్తి కనపడుతుందో! ధర్మరాజు కౌరవుల దగ్గిరికి శ్రీ కృష్ణుని రాయబారానికి పంపుతున్నాడు. ఇతగాడు అసాధ్యుడు. ఈ ధర్మరాజును ఒకరు తేనె పూసిన కత్తి అన్నారు. కౌరవులు చెడ్డవారు, తన భాగం ఇవ్వరు అని తెలుసును. యుద్ధం తప్పదనీ తెలుసును. కౌరవులూ తామూ అన్నదమ్ముల పిల్లలు. ఒకరి నొకరు చంపుకుంటే లోకం హర్షించ దని తెలుసు. కనుక యుద్ధానికి వస్తున్నామని చెపితే తప్పవుతుంది. తాను మంచి వాడు, ధర్మరాజు! పగ, క్రౌర్యం దోషాలు. ఇంతకీ కృష్ణుడు జగజెట్టి. తన కోసం ఏదైనా చేస్తాడు. జరిగే దంతా తనకీ ముందు తెలుసు, కృష్ణుడికీ తెలుసు. ఇంక రాయబార మెందుకు? ధర్మరాజుచేత ఎలా మాట్లాడిస్తాడో చూడండి తిక్కన. ముందు కృష్ణుడికి చక్కిలిగింత పెడతాడు.

ఆపద గడవం బెట్టగ
నోపి శుభం బైన దాని నొడ గూర్పను, మా
కీ పుట్టువునకు పాండు
క్ష్మాపాలుడు నిన్ను జూపి చనియె మహాత్మా!

అని, కౌరవులు చేసిన చెడ్డపను లన్నీ చెప్పి -

అక్కట! లాతు లైన పగరైనను చంపన కోర నేల? యొం
డొక్క తెరంగు లేదె, అది యొప్పదె, బంధు సుహృజ్జనంబు లా
దిక్కున నున్నవారు, గణుతింపక సంపదకై వధించి దూ
రెక్కుట దోష మందు టను నీ దురవస్థల బొందవచ్చునే!

అంటాడు.

మంచితనంతో కలిసి ఎంత రాజనీతి, గడుసుతనం ఉన్నాయో చూడండి. ఇవి ధర్మరాజు మాట లని తెలిసిపోతాయి. ఇక్కడ తిక్కన్నగారు మామూలు మాటలు మామూలు సంభాషణలో వాడినట్లు వాడుతాడు. ఇంకో చోట కర్ణుణ్ణి సర్వసేనా నాయకుణ్ణి చేసి, శల్యుణ్ణి అతని సారథిగా పంపుతాడు దుర్యోధనుడు. శల్యుడికి లోపల పాండవుల మీదే ఇష్టం. అతడు ముందే ఎలా అంటాడో చూడండి :

'గాండివ జ్యా నినాదమ్ము గ్రమ్మి కర్ణ విదళనము చేసినను' - నీకు బుద్ధి వచ్చును అంటాడు. అంటే, అర్జునుడి విల్లైన గాండీవం నారి మోగితే నీ చెవులు బద్ద లైనప్పుడు నీకు బుద్ధి వస్తుందని. కర్ణం అంటే చెవి కదా! ఇక్కడ శల్యుడు ఇంకో అర్థం కూడా లోపల పెట్టుకున్నాడు. కర్ణుణ్ణి బద్దలు కొట్టినప్పుడు కూడా అని. ఈ మాటలు వింటూంటే మొదటే మనకు భయం పుడుతూ ఉంటుంది- కర్ణుడు ఓడిపోయినట్టు అనిపించి. ఇది నాటక కర్తలో చాలా గొప్ప శక్తి.

తిక్కన్న గొప్ప కవి కూడా అని చూపించడానికి ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను. ధర్మరాజు గొప్ప చక్రవర్తి అని చెప్పడానికి మామూలు వాడైతే ఏ మంటాడు? చాలామంది రాజులు అతన్ని కొలిచేవారు. అతనికి ఎన్నో లక్షల ఏనుగులూ అవీ ఉన్నా యంటాడు. మహాకవి అయిన తిక్కన్న ఎలా చెప్పాడు ఈ సంగతే?

"ఎవ్వాని వాకిట ఇభ మదపంకంబు
రాజ భూషణ రజో రాజి నడగు !"

తెలియడం లేదూ? ఇది అసత్యం చెప్పడం కాదు. అందంగా, స్పష్టంగా మనస్సు కెదురుగా కనబడేటట్టు చెప్పాడు.

ఇలాగ తిక్కన భారతం పదిహేను పర్వాలూ మొదటి నుంచి చివరిదాకా ఒక అక్షరం వదిలెయ్యవలసింది కాదు. చదవడం మొద లెడితే ఒక అక్షరం వదులుకోలేం కూడా. ఏ డెనిమిది వంద లేళ్లనుంచి పల్లెల్లో, పట్టణాల్లో, ఇళ్లల్లో, రచ్చబావళ్లలో ఈ భారతం చదువుకుని పురాణంగా చెప్పి తెనుగువారు తమ జీవితంలో కలిపేసుకున్నారు. తిక్కన్న రచనలో అంత జీవచ్ఛక్తి, చైతన్యం ఉన్నాయి.

–రేడియో ప్రసంగంగా ప్రసారితం.

# శ్రీనాథుని కవిత

తెలుగుకవులలో మనకి శ్రీనాథుడంత యిష్టుడైన కవి మరొకడు లేడు. ఎంచేతంటే అతనిలా ఆకర్షించే కవితామూర్తి (పొయటిక్ పెర్సొనాలిటీ) మరొకటి లేదు. అంతటి కవులూ అంతకన్న గొప్పకవులూ లేరని కాదు. అంత స్పష్టసుందరంగానూ అలాంటి వన్నెచిన్నెలతోటీ కనబడే మరొక తెలుగుకవి మూర్తి లేదని. ఈ మూర్తి అతని గాథల్ని తెలుసుకొని కట్టుకొన్నది కాదు, కేవలం ఆయన కావ్యాల్ని చదువుతూంటేనే మనకళ్లకి కట్టేది. భారతం చదివి కవిత్రయంవారి మూర్తులు పట్టుకోలేము. అయితే వారు శ్రీనాథునికంటె తక్కువ కవు లనా ? కాదు. భారతం చదువుతుంటే ఉదాత్తమైన ఆర్షవాణి వినబడుతుంది. శ్రీనాథుని కావ్యాలు చదువుతుంటే ప్రౌఢ సుందరమైన మానవవాణే వినబడుతుంది.

శ్రీనాథుడు వీరభద్రారెడ్డి ఏలుబడిలో అగ్రహారాల్లో ఉన్న బ్రాహ్మణోత్తముల్ని వర్ణిస్తాడు --ఏమనీ ? -- 'నొసటిమీద గంగ మట్టితో కస్తూరికా పుండ్రాలు పూసికొన్నారనీ, దర్భ లుంచుకొనే వేళ్లమీదే మాణి క్యాంగుళీయకాలు పెట్టుకొన్నా రనీ, జంధ్యాలతో కూడా తారహారాలు వేసుకొన్నా రనీ, శిఖలలో చెంగల్వవిరులు చెరువుకొన్నా' రనిన్నీ. ఇలా శ్రీనాథుడు తన్ను తానే వర్ణించుకొన్నాడా

అనిపిస్తుంది. అతడు పరమశైవుడు; పరమభోగిన్నీ. శైవాచారమూ, సౌందర్యానురక్తి పరస్పర విరుద్ధాలు కావు సరిగదా, సరసంగా కలిసుండడానికి కూడా వీలుందని అతని జీవితం రుజువుచేస్తుంది; అతని కవిత్వమూ రుజువుచేస్తుంది. పోతన్నగారు పరమ భాగవతోత్తముడు, ఏ కొద్దిమందిలాగో -- అంతే! ఆయన జీవితమంతా ఒక్కటే ఒక్క మహానుభూతిలాగ కనబడుతుంది. శ్రీనాథుడు సానివాడలో రుచీ, సప్తగోదావరంలో శుచీ మొదలైన రకరకాల అనుభవాలు కూడగట్టుకుంటూ, అన్నీ తనవి చేసుకుని మనవిచేస్తాడు. భాగవతంలో దేవుడు దేవుడే - మన కందరాని పెనుచీకటి కవ్వలి వెలుగులాగ - కొంతవరకు దశమస్కంధంలోని కృష్ణుడు తప్ప. భాగవతంలో భక్తుడు కూడా అందరాని ఆవేశమూర్తే కాని, రూపొందిన మానవ విగ్రహం కాదు. శ్రీనాథుడి కావ్యాల్లో శివుడు మానవుడంత దగ్గిరగా స్పష్టంగా కనబడతాడు. వ్యాసుడివంటి రుషి కూడా ఆకలిబాధకు మనలాగే అల్లల్లాడిపోతాడు. పోతన మహాకవి భాగవతంలో మానవాత్మ అందరాని పరమాత్మకోసం అశ్రులు చాచిన ట్లుంటుంది. శ్రీనాథ మహాకవి కావ్యాల్లో పరమశివుడు ప్రమథగణాలతో సహా మనమధ్య విహరిస్తున్న ట్లుంటుంది. అక్కడ భక్తి ముక్తికోసం పడే ఆవేదన; ఇక్కడ భక్తి రక్తిగా ఉండే అనుభూతి!

దక్షారామ భీమేశ్వరుని అలంకారాలూ, చేష్టలూ చూడండి:

గజచర్మ మెప్పుడో కాని, నిచ్చలు గట్టు
　　పసిడి కమ్ముల పట్టు పచ్చడంబు;
భసిత మెన్నడొ కాని, ప్రతిదినంబు వలందు
　　మలయజంబు కురంగమదము గూర్చి
నిడుద పాములరాజు తొడవు లెన్నడొ కాని,
　　తారహారములు నిత్యము ధరించు;

వృ కరంక రుండ మాలిక లెన్నడో కాని,
ధరియించు కల్హార దామ మెపుడు;
కాట నడుచక్కి నెన్నడో కాని, ఉండు
దక్షవాటి సువర్ణసౌధముల మీద;
ఎన్నడో పిశాచులనుగాని, ఇందుముఖుల
నెల్లకాలంబు తలచు భీమేశ్వరుండు.

ఇలాగే మహారాజు లిచ్చిన కంఠమాలలూ, కేయూరాలూ, భూషణా లన్నీ ధరించి, నందిగానీ, భృంగిగానీ కైదండ లివ్వగా 'కన్నెలు కాఁ దారి' దారి భీమేశుడు వాడ వాడల బొరబడతాడు - 'ధూర్త ప్రకారంబునన్'. ఇంకో ఘట్టం చూడండి - వ్యాసునికి కాశీ వియోగం వచ్చేఘట్టం: కాశీలో ఎంత తిరిగినా వ్యాసుడికీ శిష్యులకీ మాధుకర భిక్షాన్నం దొరకదు; ఆకలిబాధ కోర్వలేక వ్యాసుడు కాశీని శపించ బోతాడు. అప్పుడు ఒక విప్రభవనంబు వాకిట పార్వతి ప్రాకృత వేషంబున వస్తుంది - ఎలాగా అంటే:

వేవలి పాటపాట వరవెంద్రుకతో తిలతండులాన్వయ
శ్రీ నటియింప కై సడలి, వ్రేకని చన్నులు పాలవంకలై
కా నసియార్ప వాలు తెలిగన్నుల కల్కితనంబు వీడ్కొనన్ -

"వేద పురాణ శాస్త్ర పదవీ నదవీయసి యైన పెద్ద ముత్తైదువ" రత్నకట కాభరణంబులు ఘల్లు ఘల్లు మంటుంటే, "మునీశ్వరా ర" మ్మని పిల్చి -

"ఆకంఠంబుగ నీవు మాధుకర భిక్షాన్నంబు భక్షింపగా
లేకున్నన్ కడు నంగలార్చెదవు, మేలే, లెస్స, శాంతుండవే?
నీ కంటెన్ మతిహీనులే కటకటా నీవార ముష్టింపచుల్
శాకాహారులు కందభోజులు శిలోంఛప్రక్రముల్ తాపసుల్?"

అని శిష్యులతో కూడా అతనిని భోజనానికి రమ్మంది అమ్మవారు.

వ్యాసుడూ, శిష్యులూ వస్తారు. ఆవిడ అందరినీ కూర్చోబెట్టి 'గొడుగు బాగలు గిలుకలు కులుకరింప' — వడ్డన చేస్తుంది. భవనభర్త తాపసులకు అన్నం ధారపోస్తాడు. తర్వాత ఆ మహాదేవి —

"ఆరగించితె కడుపు నిండార నీవు?
శిష్యతతి భోజనంబు చేసెనె యథేచ్ఛ?"

అని అడుగుతుంది. అప్పుడు యజమాని, అంటే పరమశివుడు –

"ఎట్టు పురాణముల్ పదియు నెన్మిది చెప్పితి? వెట్టు వేదముల్
కట్టితి వేర్పరించి, నుడికారము సొంపెసలార భారతం
బెట్టు రచించి, తీవు ఋషి వెట్టయి తొక్క దినంబులోననే
పొట్టకులేక తిట్టెదవు పుణ్యగుణంబులరాసి కౌశికన్ !"

అని వ్యాసుణ్ణి మందలిస్తాడు. ఈ గాథలో వేదర్షి, క్షుద్బాధ, అన్నపూర్ణాదేవి పెద్ద ముత్తయిదువలా కనబడడం, వడ్డనలూ, భోజనాలూ, తరువాత వ్యాసుణ్ణి శివుడు దెప్పడమూ, ఇవన్నీ మానవ సహజంగా మన యిళ్లల్లో జరుగుతున్నట్టే అనిపిస్తాయి. ఇలాగే చిరుతొండనంబి కథలోనూ, మిగిలిన కథల్లోనూ.

స్వర్గలోకంలో తెల్లవారింది. పుంస్కోకిలాలు పారిజాత పల్లవాలు మేయడం, ఐరావతం ఉషర్వీధికి వెళ్లడం, బాలవత్సంకోసం కామధేనువు హుంకరించడం, శక్రుని గడియారంలో శంఖారవం మోగడం అన్నీ వర్ణించి, తర్వాత శ్రీనాథుడు అంటాడు –

మాటుగా వైచిన మాంజిష్ఠ తెర యెత్తి
పంజుమంచము డిగ్గె మంజుఘోష,
మొకరి మట్టెల మ్రోత ముద్దు జూపగ రంభ
కనకంపు గొడుగు బాగాలు దాడిగె,

ఒకట వేనలి ముడిచి ఒక్క కేల ఘృతాచి
గాజు రెక్కల తల్పు గడియ పుచ్చె,
అలసభావముతోడ అలవోక ప్రమ్లోచ
నిల్వుటద్దంబులో నీడ చూచె,
హరిణి కీలించె నలిన పట్టాంశుకంబు
మేనక ధరించె పాలిండ్లమీద రవిక
అప్సరస్త్రీ నికేత నాభ్యంతరముల
కొక్కురో కో యటంచును కోళ్లు కూసె.

ఇలాగ, దేవతల్ని మానవుల్లాగ చూపించడమే కాకుండా అత నే దృశ్యాన్ని వర్ణించదల్చుకున్నా దాన్ని స్పష్టంగా కళ్లముందు పటంలాగా చూస్తాడు ; కనుక చూపించగలుగుతున్నాడు.

సూర్యుడికి రథం ఉంటే, ఆ రథానికి ఏడు గుర్రా లుంటే, దానికి అనూరుడనే సారథి ఉంటే, అది పొద్దున ఉదయపర్వతం ఎక్కితే, అది ఆ పర్వత సానువులమీద దాని చక్రాలు కరకరమంటూ పాకడం, గుర్రాల కళ్లేలు లాగిపట్టి అనూరుడు వెనక్కి ఒరగడం, అంతా ఏ రథమైనా ఏకొండయినా ఎక్కేటప్పు డున్నంత నిజంగా బొమ్మ కడతాడు.

అలాగే - అగస్త్యుడు వస్తున్నాడు. వింధ్యపర్వతం అతనికి మ్రొక్కుతుంది. మొగులు ముట్టిన మహా మూర్ధంబును భూమిమీద మోపుతుం దట ఆ కొండ. తన గుహారంధ్రములు ప్రతిధ్వనుల నీన స్వాగత మిస్తుందట. వీటినిబట్టి అతనిలో స్పష్ట చిత్రీకరణ శక్తే కాక సాహ సోపేతమైన భావనకూడా కనబడుతుంది. విశాలమైన తెరా, గాఢమైన రంగులూ, బలమైన రేఖలూ అతని పరికరాలు.

మొత్తంమీద ఇతనిది భారీ వాణి, భారీ బాణీ!

శ్రీనాథుని కింకొక గట్టిశక్తి ఉంది. అతని కవితాస్రవంతి. నిత్య పూర్ణవాహిని అడుగడుగునా ఉపనదులు వచ్చి పడుతుంటే అరు

కాలాలూ నిండుగా ప్రవహిస్తున్న ట్టుంటుంది. ప్రతిదినమూ ప్రతి కార్యమూ కూడా పద్యములతోనే ప్రారంభించిన ట్లనిపిస్తుంది. పద్య రచన అతని కంత సులభమే కాకుండా, మాటంత సహజం కూడాను. అందుకనే కొన్నిచోట్ల విషయంమీద కన్నా కూడా రచనా ప్రౌఢత్వంమీదా, విన్యాసంమీదా ఎక్కువ మమత ఉన్నట్టు కనబడుతుంది. ఒక వస్తు వర్ణన మొదలుపెట్టి, ఒకపాదం అయ్యే సరికి మరిమూడు పాదాలు ఒకదానిమీద ఒకటి ఉప్పెనలా తోసుకువస్తే వదులుకోలేడు. మరి వెంటనే ఇంతలో మరొక పద్యం తయారవుతుంది. కనుక, సంయమం మాత్రం కొంచెం తక్కువేమో అనిపిస్తుంది. కవిబ్రహ్మ తిక్కన కవితలో చెప్పేది ముఖ్య మనిపిస్తుంది; శ్రీనాథుని కవితలో కొన్నిచోట్ల చెప్పే విధానం ముఖ్య మనిపిస్తుంది. అయినా అతనికావ్యం చదువు తున్నప్పుడు మాత్రం అతని కవితాధార మన మనస్సుల్ని ఒడిసి పట్టుకొని లాగుకునిపోతుంది. ఈ గుణంవల్లనే ఎంత చిన్న విషయమైనా శ్రీనాథుని నోట రమ్యమైన పద్యంగా తయా రౌతుంది. బెండపూడి అన్నమంత్రికి ఎన్నోభాషలు వచ్చు నట. ఉన్న విషయమంతా యింతే. ఇంకొక చచ్చుకవి అయితే అన్న మంత్రి– 'పెక్కుభాషలు నేర్చి పెంపెక్కురీతి' అని చప్పగా చెప్పుకుపోవచ్చు. లేకపోతే పెద్దకవి అయితే ఆ విషయాల్ని పద్యంలో ఇరికించకపోవచ్చు; ఒకమాటలో లాగి పారవెయ్యొచ్చు. శ్రీనాథుడు ఏమంటాడో వినండి :

> అరబీభాష, తురుష్కభాష, గజ, కర్ణాటాంధ్ర గాంధార ఘూ
> ర్జర భాషల్, మలయాళభాష, శకభాషా సింధు సౌవీర బ
> ర్బరభాషల్, కరహాటభాష, మరియుం భాషావిశేషంబు ల
> చ్చెరువై వచ్చు సరేది యన్ననికి గోష్ఠీ సంప్రయోగంబులన్ !

ఎంత ఒయ్యారంగా ఉందో పద్యం!

ఆ ఊరి చుట్టూ పొలాలు సారవంతాలు. అక్కడ కూరగాయ లెన్నో దొరుకుతా యట - దోస, పొట్ల, కాకర, వంగ మొదలైనవి.

త్రపుస పుష్పలతా మతల్లీ పటోలికా
కారవేల్ల కుడుంగకములతోడ,
కూష్మాండ, వృంతాక, కోలక, చించికా
కాయమాన కదంబకములతోడ,
శాకినీ, మూలక, ఛత్రాక, సారణీ
ధాన్యాక, మేఘ నాదములతోడ,
పిప్పల్యుపోదకీ పీత పలాండుక
వాస్తు శాఖాకోటి వాటితోడ,
రాజనలతోడ శృంగబేరములతోడ
చిరుగడపు పెండలముతోడ చేమతోడ
ఒప్పు నాలుగు పాలములం దుపవనములు
భువనసారము పిరికాపురవరమున.

శ్రీనాథుడికి అన్నిరకాల శయ్యాసౌభాగ్యంమీదా మక్కువ ఎక్కువ.

ఈ లౌల్యమూ, ఈ రచనావాల్లభ్యమూ అతని జీవితయాత్రలలో నిత్యమూ అనేక చాటువులను చెప్పించాయి. శ్రీనాథుని చాటువులుగా ప్రసిద్ధికెక్కిన వాటిలో చాలావరకు అతనివే అని తోస్తుంది. ఆ చాటువులలోనూ, కృత్యా ద్యవతారికలలోనూ, క్రీడాభిరామం లోనూ, పల్నాటివీర చరిత్రలోనూ అతని తెలుగుతనం ఎక్కువగా కనబడుతుంది. నిజానికి తెలుగునాటి కవి అంటే శ్రీనాథుణ్ణి మొదట చెప్పాలి. ప్రౌఢదేవరాయల ఆస్థానంలో ఒకకవి శ్రీనాథుణ్ణి 'మీరు రెడ్డిరాజుల ఆస్థానంలో విద్యాధికారిగా ఉన్నప్పటి బిరుదు లేవీ చెప్పలేదే' అని అడిగితే శ్రీనాథు డన్నాట్ట!-

తరువున గాండివం బిడడె ధర్మజు వాన కిరీటి ? ఏను వా
క్సరసిజనేత్ర ఆనతి విచారము చొప్పున గర్వహీనతన్
మరలి తెనుంగుభూమి కసమానగతిన్ గొనిపోవు వాడనై
బిరుదులు వారివాగుకడ బెట్టితి - సత్కవిసార్వభౌముడన్ !

ఆజన్మాంతమూ ఆంధ్రదేశ మంతటా అహరహమూ శిష్య బృందముతో అతడు తిరుగుతున్నట్లు కనబడతాడు. శ్రీనాథుడికి ఒక సంసారమూ, ఇల్లూ, వాకిలీ అంటకట్టా లనిపించదు. 'ఎట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు ?' అన్న పద్యంలోని బాధలు కూడా అతనికి నచ్చినట్లు కనబడవు. అత డా కష్టాలు నిజంగా పడినా అతను పడ్డాడని మాత్రం ఒప్పుకోవాలని ఉండదు. ఇవేళ ఇక్కడ విన్సన మంత్రితో హేమపాత్రాన్నం భుజించాడు. రే పక్కడ వీరభద్రా రెడ్డితో కస్తూరి పూసుకొన్నాడు. ఈనాడు సప్తగోదావరంలో క్రుంకులాడి భీమేశ్వరస్వామి పద సమారాధనము కావించాడు. మరో నాడు రాయల ఆస్థానంలో విద్వత్సభలో గౌడడిండిమభట్టు కంచుఢక్క పగల గొట్టించాడు. వీథిలో, వాడలో, విపణిలో, జాతరలో, ప్రభువుల ఆస్థానాలలో, పండిత పరిషత్తులలో రకరకాల తరగతుల మనుష్యుల్ని, రకరకాల ప్రకృతుల్ని పరిశీలించాడు. అందరినీ పద్యాలతో పలకరించుకుంటూ పర్యటన సాగిస్తూండేవాడు. ఆ చాటువుల్లోని హాస్యమూ, జీవమూ, తెలుగుతనమూ వాటిని ఇప్పటికీ నిలబెట్టుకుని వచ్చాయి. వాటిలో ఆ నాటి ఆచార వ్యవహారాలే కాక, వీథులు, భవనాలు, వినోదాలు, జాతరలు, మాలెతలు, చాకెతలు, బ్రాహ్మణ స్త్రీలు, జంగమురాండ్రు, మంత్రులు, దండనాయకులు, రాజులు అన్నీ కళ్లకి కట్టినట్టు కనబడతాయి. మానవసంఘంతో అంత పూసుకుని తిరిగిన వాస్తవికజీవి కనుక ఇతరకవు లెవరిలోనూ లేనంత హాస్యరసం ఇతనిలో వెల్లివిరిసింది. అది చాటువుల్లోనే కాదు - అతని కావ్యాల్లో కూడా.

అన్నపూర్ణాదేవి వ్యాసుడికీ, శిష్యులికీ ఉచితాసనాలు వేసి, విగురరటాకులు పరిపించింది. వడ్డనమాత్ర మేమీ లేదు; పంక్తిపంక్తీ ఆమె వచ్చి,—

"ఇందరుకూడి శాంతి పఠియింపుడు, మజ్జన మాచరింపుడు-కానీయండి భోజనం" అంటుంది, పంక్తిపంక్తి నడుమా నిలిచి ఆపోశనంబులు పోయిస్తూంటుంది.

అప్పుడు వ్యాసుడూ శిష్యులూ అనుకుంటారు :

వండిన చొప్పునన్ పొగపు వాసనయున్ పొగపారు చందమున్
భాండసమృద్ధి, సంపదయు, పానవిభూతియు సర్వమంగళంబు

కాని,

చల్లని సౌమ్యదృష్టియు, ప్రసాదము, మాధురియున్, వివేకమున్,
వెల్లదనంబు, మౌగ్ధ్యమును, నిర్మలినత్వము చూడవచ్చినన్,
కల్ల యొకింతయేని పొడగానగరా, దరటాకు చూచినన్
ఝల్లనె గుండె, యోగిరము శాకములున్ పొడగానరామికిన్,

అలాగే, దక్షాధ్వరధ్వంసంలో వీరభద్రునిమీదికి విష్ణుమూర్తి చక్రం విసిరితే, అది 'చక్కిలంలా బొక్కే' డంటాడు; 'ధాత నతిముక్కు శోణంబుదాక కోసె' అంటాడు. మరోచోట 'చదివె గురునొద్ద ధర్మశాస్త్రములు తొలుత, పరమ విశ్వాస తాత్పర్య భక్తి గరిమ; చదివె చంద్రుండు కామశాస్త్రంబు పిదప, తలిరుపొన్పున ననురక్తి తారయొద్ద' అంటాడు. కొన్నిచోట్ల ఈ హాస్యాన్ని లోకోక్తుల వల్ల సాధిస్తాడు. తనకులాగే కాశీ వియోగం కలిగిన అగస్త్యునితో లోపాముద్రతో కలిసి, వ్యాసుడు 'ముగురన్ గూర్చిన ముండదైవమునకున్ మోమోట లేదో సుమీ?' అంటాడు.

శ్రీనాథుడు సహస్రమాస జీవి అయి ఉంటాడు. సంపూర్ణంగా సరసంగా జీవితం సాగించి ఉంటాడు. జీవితంలో వెలుగునీడలూ, కష్టసుఖాలూ కూడా బాగా తెలుసుకొని ఉంటాడు. ఎక్కడ పుట్టాడో ఏ ఊరో మన కెందుకు? తెలుగునా డంతా ఇతనిదే. శిష్యులతో నడుస్తూ, విశ్రమిస్తూ, కొలువుంటూ ఎప్పుడూ కవితావ్యాసంగం చేసి ఉంటాడు. ఇతని జీవితం అవిశ్రాంతమైన కవనోత్సవం. ఆ రోజుల్లో ఈ మహాకవివల్ల, కవిత్వం ఒక ఉద్యమంగా వ్యాపించి ఉంటుంది. ఎందరో చిల్లరకవులు శ్రీనాథుని శిష్యులమని చెప్పుకొని విర్రవీగేవారని తోస్తుంది. నెల్లూరినుండి కొండవీటికి వెడితే అక్కడ కొండవీటివారికి ఉత్సవం. కొండవీటినుంచి రాజమహేంద్రవరం వెడితే అక్కడి కవి కమల వనానికి సూర్యోదయం. నేటికీ శ్రీనాథుని కావ్యం చేతిలోపడితే కవికోటికి పండుగ. శ్రీనాథుడు కవులకవి. అతని తరువాత కవులలో దిగ్గజా లనిపించుకొన్నవారికికూడా శ్రీనాథుని కవితారీతులంటే అనురక్తి. అవి ఒరవడి పెట్టుకుని వ్రాయాలని ఆసక్తి.

"సూనాస్త్ర ప్రమదా మద స్ఫురిత వక్షోజాత కాఠిన్యమున్
పూనంజాలు వచోవిలాసముల నేర్పుల్ సూపి కర్ణాటక
క్ష్మానాథేంద్రుసభన్ కవిత్వ విజయోత్సాహంబు గైకొన్న మా
శ్రీనాథున్ కవిసార్వభౌము గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్."

—రేడియో ప్రసంగంగా మద్రాసు నుంచి ప్రసారితం; 7-11-1954 వాణిలో ప్రచురితం.

# పెద్దన

ఒక్కొక్క కావ్యం పఠించాక, ఆ కవి మనకు ఎలాగో పరిచితు డని పిస్తుంది. అతని మూర్తి కూడా మన మనోనేత్రానికి గోచరిస్తుంది.

నా కళ్లకి పెద్దన్న అంత అజానుబాహువు కాడు. మేలిమి కుందనం శరీరచ్ఛాయ. కొంచెం స్థూలంగానే ఉంటాడు. ఎర్రజీరలతో తెలివి తేటలతో చురుకుగా మెరిసే విశాలనేత్రా లాయనవి. "పసిడి వ్రాత చెరంగు మిసిమి దోప చెలంగు నరుణాంశు కోత్తరీయంబుతోడ, సరి లేని రాకట్టు జాళువా మొలకట్టు బెడగారు నీర్కావి పింజె తోడ," జిలుగు అంగరఖాతో, "ధవళధవళము లగు జన్నిదముల తోడ", తాంబూల రాగముతో, మనోహరముగా, కవి ఎలాగ ఆ రోజుల్లో ఉండాలో అలాగ ఉంటాడు. వార్ధక్యంలో ఆ వయస్సుకు తగిన సౌందర్యం నిలబెట్టుకుంటూ ఉంటాడు. యౌవనంలో "భా షాపరశేషభోగే" కాక, "మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి" కూడా. నన్నయ "అవిరళ జపహోమ తత్పరుడూ, నిత్యసత్య వచనుడూ" అయిన రుషి. అస్థిమాంసాదులతో ఆయనమూర్తి కట్టడం కష్టం. కేవలమూ తేజఃస్తంభ మాయన. ఇక సోమయాజులు గారి వద్దనుండే మన మహా కవుల భౌతికమూర్తులు మన భావనా

వీథిలోకి వస్తూ ఉంటవి.

"ధరియింప నేర్చిరి దర్భ పెట్టెడు వ్రేళ్ల
లీల మాణి క్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగ మట్టియ మీద
కస్తూరికా పుండ్రకములు నొసట
సవరింప నేర్చిరి జన్నిదంబుల మోల
తారహారములు ముత్యాల సరులు
చెరువంగ నేర్చిరి శిఖల వెన్నడుముల
కమ్మని క్రొత్త చెంగల్వవిరులు
ధామముల వెండి పైడియు తడబడంగ"

అన్నట్లు ఉంటాడు పరమ మాహేశ్వరు డైన శ్రీనాథుడు. పెద్దన్న గారి దగ్గరకి వచ్చేసరికి ముత్యాలసరులు, తారహారాలు చిక్క నవుతాయి. చెంగల్వ విరుల వాసనలు ఎక్కు వవుతాయి, మాణి క్యాంగుళీయకాల మెరుపు లెక్కు వవుతాయి. "అర్ధచంద్రుని తేట నవఘుశించు లలాట పట్టి"ని కస్తూరికా పుండ్రకాలే నిలుస్తాయి.

నన్నయ భట్టారకుడు మహారాజగురువు. పెద్దన సార్వ భౌముని ప్రాణ స్నేహితుడు. తరువాతి కవులు ప్రభువుగారి ఆశ్రితులో, సేవకులో! కనుక వారి వారి కవిత్వ పద్ధతులూ మారు కుంటూ వ స్తవి. లోకకల్యాణంకోసమో, ఆంధ్రావళి మోదంకోసమో ఆంధ్రకవిత్వ దీక్షావిధి వహించో, "మార్కండేయ శివమౌళి చం ద్రాంశు నవసుధా సారధార" కారణము కాబట్టో, రామచంద్రుడు పలికించడముచేతనో భారత భాగవతాది పురాణాలు ఆది యుగములోని ఆంధ్ర మహాకవులు ఆలపించారు. వారు తమ తమ కావ్యాలలో రజతాచల శిఖరం ఆరోహిస్తూంటారు; రత్నాకర గర్భంలోకి చొచ్చుకుపోతూ ఉంటారు. ఏదో పారలౌకిక శక్తిచేత ప్రేరేచబడిన వాణి వారిది.

అల్లసానివారి యుగంలోకి అడుగు పెట్టేసరికి ఎంతో మార్పు వచ్చింది. ఆయన కావ్యకన్యక ఆరామాలలో, అంతి పురపు కుట్టి మాలలో, సస్యశ్యామలవీథుల్లో, శశికాంత వేదుల్లో విహరిస్తూ ఉంటుంది. భాషాపరశేషభోగే కాక, పెద్దన అసలైన, సిసలైన భోగి అనిపిస్తుంది. అందువల్లనే ఆయన కవిత్వం కూడా సఖంపచంగా ఉంటుంది: అనగా గోరువెచ్చగా, సుఖంగా, హాయిగా ఉంటుంది. మన హృదయాలను పట్టుకొని తారా మండలంలోకి ఎత్తదు, పాతాళగర్భంలోకి దింపదు. కాల్చదు, ఏడ్పించదు, పరవశం చెయ్యదు, మాటల కందరాని దేదో ఆ ఆనందానుభూతి కలిగించదు. దానిలో "కడలి లోతుల తావులు", "మింటి పూవులు" కనబడవు. కాని వడిదుడుకులు లేక ఒయ్యారంగా రక్తి కట్టించే బాధలతో, రాగం పుట్టించే గాథలతో ఉల్లాసంగా ఉంటుంది. ఆత్మ కింపయిన భోజనం చేసి, రమణీ ప్రియదూతిక తెచ్చి ఇచ్చు కప్పురవిడెము వేసుకుంటూ, ఉయ్యేల మంచముమీద కూర్చుండి, హాయిగా పయికి ఆలపిస్తాము మనుచరిత్రను. సుఖ సమయంలో, దుఃఖ సమయంలో, దైనందిన జీవితములో, తీవ్ర విప్లవ సంఘటనలో, రాత్రీ, పగలు ఎప్పుడు పడితే అప్పుడు పఠిస్తుంటాము భారతాదులను.

అక్బరు చక్రవర్తి ఆస్థానగాయకుడు తాన్‌సేన్ భారత గాయక పితామహుడు. "నీలాగ ఎవ్వరూ పాడ రేమి?" అంటూ ఉండే వాడు అక్బరు. తరువాత యమునా నదీతీరాన హరదాసస్వామి పాట వింటాడు, "అతని లాగ నువ్వు పాడ వేమి?" అంటాడు తాన్‌సేన్‌తో. "ఏలినవారు పాడమన్నప్పుడు నేను పాడతాను. లోపలనుంచి ఎవరో పాడ మన్నప్పుడు ఆయన పాడతాడు" అన్నాడు తాన్‌సేన్.

పెద్దన తాన్‌సేన్. నన్నయ హరదాస స్వామి. మనుచరిత్ర మధువు, భారతం అమృతం.

మను చరిత్రకు అయువు పట్టు మొదటి మూడు ఆశ్వాసాలూ- వరూధిని ప్రణయగాథ. తరవాత ఆశ్వాసాలలోనూ "గంధవాహ బాంధవ మగు మహా సైంధవ" మెక్కి "పులియడు బూవిగా డడవి పోతులరా జనుమంతిగాడు" వంటి జాగిలాలతో ఆడిన వేట, హిందోళమును విరహ బృందార్తిగ పాడు బృందారక సతులతో, బండి గురివెంద పూదేనె తాగి త్రేచెడు తేటులతో, దారిని వెడల దోలిన పిక శిశువుతో, "చలిగాలి బొండుమల్లెల పరాగము రేచి నిబిడంబు చేయు వెన్నెల రసంబు"తో వచ్చిన వసంతము - ఇంకా ఎన్నో వస్తవి.

కాని ఎందరో మూడాశ్వాసాలు చదివి గ్రంథాన్ని ఒక ప్రక్కన ఉంచడం అలవాటు. కవి పాకచక్యం ఎక్కువ ఇక్కడనే చూపిం చాడు. ప్రవరుడు మనోజ్ఞమూర్తి, ధర్మకర్మ దీక్షితుడు. "కూకటుల్ కొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ", "వండ నలయదు వేవురు వచ్చి రేని అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి." "సుఖులై తలిదండ్రులు గూడి దేవియున్ దేవరవోలె నుండి యిలు దీర్చుచు" నుందురు. "పూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకు బోలె", "వాని చక్కదనము.... జారకామినులకు భోగబాహ్య" మైనది. వరూధిని రాకమునుపు కనబడే ప్రవరుడు బుద్ధిమంతుడే. కాని తలిదండ్రుల నీడ వదలని తరుణాగ్నిహోత్రిలాగ ఉంటాడు. వరూధిని అవత రించాక కొంత చాదస్తుడుగా కూడా కనబడతాడు. దేవవేశ్య తన శరీరాన్ని తాకినచోట ఇంత గోమయం పట్టించుకుంటాడా అని పిస్తుంది.

ఇతణ్ణి "చూచి ఝుళం ఝుళత్కటక సూచిత వేగపదారవిందయై లేచి కుచమ్ములున్ దురుము లేనడు మల్లల నాడ నయ్యెడన్ పూ చిన యొక్కపోక నును బోదియ జేరి విలోకన ప్రభా వీచికలన్ పదీయ పదవీ కలశాంబుధి వెల్లిగొల్పు"తుంది.

ఇంటివద్ద తల్లిదండ్రులు బెంగపెట్టుకుంటా రని, ఇల్లాలు ఏ మౌతుందో అని, వైదిక కర్మలు ఏ మౌతాయో అని ఆమె ఉల్లాసంగా, విలాసంగా మాట్లాడిన కొద్దీ తాను శ్రీహరి అని ఓరమో మిడుతాడు.

ఈ ఘట్టంలో కొంత హాస్యరసం ఉంది. కాని కవి ఈతనియెడ ఒక చిత్ర మైన గౌరవమూ, ఒక మృదు వైన అనురాగమూ, సానుభూతీ కూడా చూపిస్తాడు. అయితే వరూధినితో పూర్తిగా ఏకీభవిస్తాడు; అందుకే గంధర్వుణ్ణి మాయా ప్రవరుణ్ణిగా చేసి, ఆమెను అతణ్ణి సంతృప్తి పరిస్తేనేగాని కవికి సంతృప్తి లేదు, "ఎలప్రాయము వైదిక కర్మ నిష్ఫలం బోవుట" మంచిది కాదనియు, "అంధునకు కౌరయె వెన్నెల" అనియు, "సంసారాంధువన" పడుట తగ దనియు, "సశరీర స్వర్గసుఖము" కంటె కాంక్షింప తగినది వేరొకటి లేదనియు, వరూధిని అంటుంది. ఈ ఘట్టంలో "ఆసవమున్, ప్రియాంగన, వ నాంతర వాసము మా కొసంగి నీకోసము స్వర్గ మున్న దనుకో" అన్న ఉమర్ ఖయ్యాం తత్త్వం బాగా స్ఫురణకు వస్తుంది. నాటి ముస్లిం నాగరకతతో కలిగిన సంపర్క ప్రభావం గోచరిస్తుం దేమో పెద్దనగారిమీద కూడా.

కచదేవయానుల గాథ ఒక మోస్తరుగా ఇలాటిదే! కాని కచుడు జీవిత సమస్య లన్నింటినీ, దేవయానినీ, అర్థము చేసికొన్న తపస్వి. ఇక దేవయాని తొలి ప్రణయిని, తొలి వియోగిని. వరూధినీ ప్రవరులో? దేవయాని మాయకచుడే వస్తే పోల్చుకొని తీరు తుంది. వరూధిని వంటి ప్రణయిని పోల్చుకోవద్దూ? అలాగ చెయ్యడం ఆమెకూ, కవికీ కూడా ఇష్టం లే దాయెను!

పెద్దన యుగం కొత్తది. సార్వభౌము డైన రాయల రాజధాని మహానగరం. మొగలాయీ పారశీకపు రాయబారులు వస్తూ

వెడుతూ ఉంటే, వాళ్ల విజ్ఞానమూ, సంస్కృతీ మనవాళ్ల జీవితం లోకి ప్రవేశించాయి. వాళ్ల శబ్దాలే వచ్చిపడ్డాయి కొన్ని.

మహారాజు కవిపోషకుడే కాక కవిన్నీ, రసికుడన్నూ. కనుక కవు లతనికి మిత్రు లయ్యారు. మదకరీంద్రము లెక్కించి, పల్లకీ లెత్తి, అగ్రహారా లిచ్చి తన కున్న భోగభాగ్యా లన్నీ వారికీ రుచి చూపిం చాడు. కనుక వారూ, నాటి రుచులకూ, పరిస్థితు లన్నింటికీ మరిగి, వాటికి అనుకూల మైన గాథలను ఎత్తుకొని, వాటి కనుకూలం గానే కావ్యా లల్లారు. "రస సమంచిత కథలన్ విన నింపు, . . భవ చ్చతుర రచన కనుకూలంబున్!" అయిన దేవ వేశ్య వరూధిని కథ, "షోడశ సహస్ర కామినీ స్తోమ ధేనుకా రిరంసా మదోత్కట వారణేంద్ర" మైన కృష్ణుని కథ ఎత్తుకొన్నారు. ఎత్తు కొని, వరూధినిని హంపిలో వేశ్యను చేసి జీవంపోసేరు. శ్రీకృష్ణ పరమాత్మను కృష్ణరాయలను చేసి అతని అంతఃపురపు చిక్కు ఒకటి విడదీసేరు. మహారాజు జైత్రయాత్రకై బయలుదేరినపుడు ఈ కవులను కూడా తీసుకుని వెళ్లేవాడు. ఆ విజిగీష, ఆ సాహసము, ఆ నూతన ప్రియత్వము కావ్య నిర్మాణంలోకీ వచ్చాయి.

కవు లందరూ ఒక ఆస్థానంలో ఆశ్రితు లయి ఉండడం చేత తరుచు కలుసుకుని, ఒకరి ఊహలు ఒకరు చెప్పుకొనడం తట స్థించి, వారి మనసులు ఎగసన దోసినట్టయి కొత్తకొత్త పోకడలు పోయారు.

ఆ యుగశక్తు లన్నింటినీ అర్థం చేసుకుని, పాత పురాణ మార్గం వదలి, సమగ్రంగా వికసించిన చక్కని సరస ప్రబంధాలను మొదట రచించిన దూరదర్శి, మహాకవి, ఆంధ్రకవిత్వ చరిత్రలో యుగపురుషుడు పెద్దన. అతని కావ్యభాష, శైలి, అన్నీ నవనవ

సుందరములు. అతని గొంతు, బాణీ అన్నీ వేరే. ఆ పద్ధతులు చూస్తే పెద్దన ఆంధ్రకవితా పితామహుడేను!

"హితుడవు చతురవచోనిధి,
వతుల పురాణాగ మేతిహాస కథార్థ
స్మృతి యుతుడ, వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్?"

—రేడియో ప్రసంగంగా ప్రసారితం.

కవి స్వప్న జగత్తు :

# వేమన

లోకాన్ని కవి చూడడంలోనూ, ఇతరులు చూడడంలోనూ రెండు తేడా లున్నాయి. కవి చూపు ఇతరుల చూపు వంటిది కాదు. అది మసు గొత్తిగించి చూస్తుంది; తొలిచి చూస్తుంది. వికారం లోపల దాగి ఉన్న సౌందర్యాన్ని పెల్లగించుకు చూస్తుంది.

కనుకనే కవి ఆశావాది కూడా. అలా చూడలేని వానికి లోకం దుస్సహంగా దుఃఖమయంగా ఉంటుంది. వానికి ఈ లోకం వట్టి స్వప్న మనిపిస్తుంది; లేదా దాని నుంచి విడిపించుకుని విపినాల లోనికి పారిపోతాడు. పలాయనం చిత్తగిస్తాడు. నిజమైన కవి ఎవ్వడూ అలా పారి పోలేడు. ఈ లోకంలో దాగి ఉన్నదీ, తానే చూడగలిగేదీ, చూచేదీ సౌందర్యాన్ని చూపించి "ఇదిగో ఇది మనది, పై నున్న తుక్కూ దుమ్మూ అంతా తుడిచి వేస్తే ఇలా ఉంటుంది" అని ప్రదర్శిస్తాడు.

ఇంతే కాక కవికీ, ఇతరులకూ ఇంకో తేడా ఉంది. కవికి ఈ లోక మంటే ఉండే బ్రహ్మాండమైన అనురాగం. అది లేకపోతే కవి కానే కాడు. ద్వేషం సృష్టించలేదు; ప్రేమ సృష్టిస్తుంది.

వేమన కవి. చాలా వింత కవి మాత్రం ఔను. అందుచేతే చూసి చూసి పెద్దలు ఆంధ్రవాఙ్మయ మందిరంలో ప్రసిద్ధ కవుల మధ్య ఇతనికి పీఠం వెయ్యలేదు.

ఇతని నోరు ఒక్కటీ ఒక రకం; మిగిలిన కవుల నోళ్లు ఒక రకం. వాళ్లది సంస్కరింపబడ్డ వాణి; ఇతనిది ఉవ్వెత్తుగా ఉబికి ఉబికి లోపల నుంచి ఇతని ప్రేక్ష్యం లేకుండా వచ్చేసింది. వాళ్ళు ఒక వివిక్త వేదిక మీద ఆసీనులై, లోకాన్ని చూస్తూ కంఠ మెత్తి ఝుమ్మని కచేరీలో రాగం తానం పల్లవీ లాగ ఒక స్పష్ట నిర్దిష్ట సరణిలో ఆలాపించిన ట్టుంటారు. ఇతడు వీథిలోనూ, విపణిలోనూ, మందిరాల్లోనూ, మఠాల్లోనూ, బాగా జనసమ్మర్ద మున్నచోటా ఒక్క నిముషం వెన్ను వాల్చకుండా హమేషా తిరుగుతూ, వీణ్ణి ఒక తన్ను తన్ని, వాణ్ణి ఒక మొట్టు మొట్టి, ఒకణ్ణి దగ్గరగా పిల్చి బుజగించి, ఒకణ్ణి కన్నుగీటి ఎగతాళి చేసి అలా మాట్లాడుకుంటూ పోయిన ట్లుంటాడు. చిత్రం - ఏనాడో వేమన అవతారం చాలించినా, ఇప్పుడూ అందరిలోనూ తిరుగుతూ మాట్లాడుతున్నట్లే ఉంటాడు. వేమన మాట నుసి కట్టని నిప్పుకణం; తగలగానే చుర్రుమంటుంది. వేమన మాట రెక్క ముడవని భరత పక్షి. కాలాలు దాటి ఇంకా ఎగిరి వస్తూనే ఉంది.

వేమన చదువుకున్నట్టే కనబడడు. చదువుల్లో మర్మం మాత్రం ఇతనికి తెలుసు.

ఇతడు అమిత వైభవాలనూ గొప్ప సుఖాలనూ ఎరగ డనలేం. కాని కనిపించడం మాత్రం "చద్ది మిగల నింట సంసార మేల?" అనే పాటివాడుగా కనిపిస్తాడు - "కుండ చిల్లికి గుడ్డ" దోపిన వాని లాగున. తెలియదగ్గ పాటి సంసారిగా అనిపిస్తాడు. అయితే-క్షణక్షణం ఇంద్రధనుస్సులు నృత్యం చేసే ప్రపంచంలో ఉరికిన వాడు లాగానూ అనిపిస్తాడు.

వేమన బాగా లోతుల్లోకి దిగినవాడు - కాళ్ళకి గులకరాళ్లు తగిలేదాకా. అయితే లోకానుభవ సముద్రుడై మాత్రం పైకి తేలినవాడు. ఇక ఇతనికి కావలసిన కరుకుదనం, చురుకుదనం ఉన్నాయి. ఉన్నవే అవి అనిపిస్తుం దొక్కొక్కమాటు ; కాని వాటితో పాటు నిజానికి ఓర్పుంది! లేకపోతే అంత నిదానంగా మనకి బుద్ధులు చెప్పనేలేడు. ఆ ఓర్పుతో నేర్పుంది. లేకపోతే అంత రుచిగా వినా లనిపించేటట్టూ చెప్పలేడు.

ఇతను వాడిన మాట వాడి గల కత్తి. కాకపోతే మనస్సులోకి దూసుకు పోలేదు. ఆ మాట గాయం చేస్తుంది; కాని వెంటనే ఆ గాయాని కతడే మందు పూస్తాడు.

అతను నూరేళ్ల ఈ మధ్య పడమటి దేశాల్లో పుడితే 'షా' అయి ఉండును ; పద్దెనిమిదో శతాబ్దిలో వుడితే 'స్విఫ్ట్' అయి ఉండును. వాళ్లకు కూడా మాట ఎంత కరుకుదో మనస్సంత కమ్మనిది. ఇతను మనల్ని కొట్టడం తండ్రి బిడ్డను కొట్టడం వంటిది – బాగా ప్రేమించిన వాడే సాగదీసి చెంపకాయ కొట్టినట్లు.

'అనతోల్ ఫ్రాన్సు' ఏమంటాడూ: "నేను చేసే ఎగతాళి నిజానికి క్రూరమైంది కాదు. ఆ ఎగతాళే నేను చెయ్యకపోతే మిమ్మల్ని ద్వేషించేటంతటి బలహీను ణ్ణయిపోదును!" అని. ప్రవక్తలూ, యుగకర్తలూ, నవ్యమార్గ దర్శకులూ అందరూ ఇట్టి వారే- వాళ్ళు మహాయోధులు. "Their words are half-battles for the true."

ఇక వేమనదీ స్వప్న జగత్తే అంటాను. అయితే ఆ స్వప్న జగత్తు భవిష్యత్తులో ఉండి తీరింది. ఇప్పుడు లేదు.

ప్రస్తుతం ఈ లోకంలో చాలా వరకు పశుత్వం, దానవత్వం కిక్కిరిసి ఉన్నాయి. ఇవన్నీ తీసి పారేసి, తగలేసి లేక నముద్రంలో

కలిపేసి మానవుణ్ణి నిజమైన మానవుణ్ణిగా చేస్తే ఈ లోకమంత సుందర మైనదీ, వాసయోగ్య మైనదీ ఉండదు అంటాడు - ప్రతీ కవిలాగే వేమన్న కూడా. కనుక వేమన స్వప్నజగత్తు నిజానికి సత్యజగత్తే !

ఇతను మహా వాస్తవికుడు. మనం అనుక్షణం చూసే రకరకాల మనుష్యుల రకరకాల లోపాలూ, రోగాలూ పట్టుకుని వాటిని నేరుగా సూటిగా కోసిపారేస్తాడు. సామాన్యుల గృహ జీవితం మొదలుకుని పెద్దపెద్దల అసత్య వర్తనం దాకా అన్నిటినీ ఎదిరిస్తాడు. అందరినీ చావ తన్నుతాడు.

ఇతని మాట సామాన్యుడిది; ఛందస్సు సామాన్యుడి నోట్లో కరిగిపోయేది. ఉపమానాలూ అవీ మహా సామాన్యమైనవి.

"అల్ప బుద్ధివాని కధికార మిస్తేను దొడ్డవారినెల్ల తొలగగొట్టు" తాడు. "చెప్పు తిన్న కుక్క చెరుకు తీపెరుగునా ?" - ఇలాగ తిట్టుకుంటూ పోతాడు. వేమన ఒక్కడిని కూడా వదలడు - మానవుణ్ణి మానవుడిగా చేసేదాకా! అక్కడ కూడా ఆగడు - దేవుడి దగ్గరకు తీసుకువెళ్ళేదాకా. దీనికి అచంచల భక్తి ప్రపత్తులు కావాలి - అంతే! కాని భక్తుల మనీ, జ్ఞానుల మనీ, భాగవతుల మనీ వేషాలు వేసే వాళ్ళని మాత్రం ఇత నొప్పుకోడు. ఊఁహుఁ! వీళ్లు మరీ మోసగా ళ్లంటాడు. వీళ్లను మరీ కఠినంగా చీలుస్తాడు. వేమనే ఒక పేద్ద నిచ్చెన- భూమి మీొంచి ఆకాశంలోకి. ఇతని వాణి పరమ పద సోపాన పటములాగ తేళ్లనీ, జెర్రుల్నీ, పాముల్నీ తప్పించి, పైకి ఎక్కించి ఎక్కించి పరమపద ప్రాంగణాన నిలబెట్టి వదులుతుంది. వేమనకి తెలుసు. ఈ లోకమే కాకుండా ప్రతీ జీవితమూ మంచి చెడ్డల సమర రంగ మని. ప్రతి హృదయంలో జరిగే ఈ సమరమే అతనికి శుభసూచకం.

వేమన ఆస్తిక్యం బుఱ్ఱలో నుంచి పుట్టింది కాదు ; హృదయంలో నుంచి పొర్లి వచ్చేది. అందుచేతనే ఇతను సూటిగా ఒక్క కేకతో దేవుడి దగ్గిరికి పోతాడు. "ఒకే ఒక్క దేవుడు, మన మందరమూ అతని బిడ్డలం ; మనమే అతని దగ్గిరికి వెళ్లొచ్చు ; మధ్యవర్తుల్నీ మాయమంత్రాల్నీ నమ్మకండి ; ఎటొచ్చీ మనం అతని సన్నిధికి వెళ్ళడానికి తగినట్లు మాత్రం తయారవాలి" అని పదే పదే చెపుతున్నట్లుంటాడు.

భూతి దేహమందు పూస్తే సరిపోతుందా - నిష్ఠ శివుని యందే నిలపాలి గాని ? బూడిదలో గాడిద పొరలదా ?

బోడి తలలూ, జడలూ, బూడిద పూతలూ, ఆసనాలూ, వేషాలూ సరంజాం అంతా ఉన్నాసరే "యోగి కాడు లోన బాగు కాకుండెనా !"

ఇంటినీ, ఇల్లాలినీ విడిచి ఇనప కచ్చడాలు కట్టినా, 'వంటకంబు. నీరు వాంఛ' లుడిగేవా ? తత్త్వం వస్తుందా ?

వేదశాస్త్రాలు చదువుకోవచ్చు. వాదు లేకుండా మాట్లాడవచ్చు. ఇతరుల కుపదేశించ వచ్చు. మనం మాత్రం గ్రహించలేము. ఎందుకొచ్చిం దిది ?

చేతులో కత్తి పట్టుకోవచ్చు ; చిత్తంలో ధైర్యం లేకపోవచ్చు. కనుక దొంగ గురువు మనకు మార్గ దర్శకుడు కాలేడు ; మన కాళ్ళకు సంకె లవుతాడు.

తాను పవిత్రు డ్ణనుకుని తన హృదయం మాత్రం భగవంతుడికి పూర్తిగా సమర్పించలేని గురువంత పరమ దుర్మార్గుడైన ఉపదేశికుడు లేడు. అలాంటి గురువు గుడ్డిగుర్రం లాంటివాడు. కనుక ఆత్మశుద్ధి లేని ఆచారం భాండశుద్ధి లేని పాకం వంటిది. చిత్తశుద్ధిలేని శివపూజ వద్దు.

ఆత్మబుద్ధులు వినుచు అన్నదమ్ములతోడ జగడ మాడేవాడు జెర్రిపోతు.

హృదయంలో దేవుణ్ణి ప్రతిష్ఠించుకుంటే జీవితం పవిత్రమూ, సత్యమూ, సుందరమూ అవుతుంది. జీవితం పవిత్రమూ, సత్యమూ అయితే దేవుణ్ణి లోపల సుస్థిరంగా ప్రతిష్ఠించుకోవచ్చు. అటు వంటి మానవ జగత్తే వేమన స్వప్న జగత్తు!

— రేడియో ప్రసంగంగా ప్రసారితం

# తిరుపతి వేంకట కవులు

**హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయంలో 1960 మార్చి ఆఖరున జరిగిన తిరుపతి వేంకట కవుల కవిత్వం మీది గోష్ఠికి అధ్యక్షులుగా కృష్ణశాస్త్రి గారు చేసిన ప్రసంగం.**

నేను వారి శిష్యుణ్ణి కాను. అంతే కాకుండా నా చిన్నతనంలో వారితో పోట్లాడిన వేంకట రామకృష్ణ కవులున్న పట్టణంలో ఉండేవాణ్ణి. ఆ ఆస్థానానికి చెందినవాణ్ణి కూడా. మాలో చాలా మందికి వారంటే ఇష్టం ఉండేది కాదు. అయితే అది కుర్రతనం! తరువాత నేను పెరగడం వల్లను, వారిని గూర్చి ఎక్కువగా తెలుసుకోవడం వల్లను, వారి కావ్యాలు చదవడం వల్లను వారిని పూజించేవారిలో ఒకడి నయాను.

అడపా దడపా వారికి చాలా దగ్గిరగా రావడం తటస్థించి నప్పుడు వారి గొప్పతనంతో పాటు వారి సౌజన్యమూ, వారి మంచితనమూ కూడా తెలుసుకున్నాను.

నేను తరచు వారిని గూర్చి ఒక ప్రశ్న వేసుకుంటూ ఉంటాను. అది ఏమిటి? ఆ కాలంలో వారికి అటూ ఇటూ పుట్టిన వారిలో వారికన్న తగ్గని కవులు మరిద్దరు ముగ్గురు ఉండవచ్చుగదా - భక్త

చింతామణి వ్రాసిన వడ్డాది సుబ్బరాయ కవిలాగ. వీరికి వచ్చిన పేరూ జనరంజకళ కీర్తి వారికి రాలేదేమో అని. అలాగే ఆ రోజుల్లో ఒక్కొక్క చోట సాహిత్య పీఠాధిపతులై, గురుదేవులై కూర్చున్న శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రుల వంటి గొప్పవారూ ఉన్నారు. అందర్నీ మించి ఆంధ్రదేశం నాలుగు మూలల్లో ఆధునిక కవి కుల గురువులై వీరే అలముకోవడం ఎందుకు? వాటికి జవాబు నేనీ విధంగా అనుకున్నాను: ఒక్కొక్కళ్ళలో ప్రతిభా, కాలమూ కలిసిపోయి కూడివస్తాయి. ఇతరులకు ప్రతిభ ఉండి, కాలం కలిసిరాదు. కలిసి వచ్చిన వాళ్ళకు తెలియకుండానే దేశ కాలాల బలం దొరుకుతుంది. వాళ్ళు ఒక ఆవేశంలాగ, ఒక ఉద్యమంలాగ మనకు సాక్షాత్కరిస్తారు. వాళ్ళకు అడ్డు ఉండదు. వాళ్ళొకచోట స్తిమితంగా ఉండలేక దేశం నాలుగు మూలలా వ్యాపించుకుపోతారు. ఎక్కడికి వెళ్ళినా వాళ్ళకు జయం. ఎందుచేతనంటే - వారి వెనకాలే ఆలంబంగా, అదృశ్యంగా ఉన్నప్పటికీ, దేశ కాలాలు ఉన్నాయి - సంస్కరణఉద్యమంలో వీరేశలింగానికి లాగ. వీళ్ళు అప్రతిహతులూ, వీరులూ గూడా. ఇతర రంగాలలో గూడా యిటువంటి వారున్నారు - టంగుటూరి ప్రకాశంగారి లాగ. వాళ్ల విజిగీషను గూర్చి, సాహసాన్ని గూర్చి ఎన్నో కథలు బయలుదేరతాయి. అన్నీ మనకు నమ్మా లని ఉంటుంది. అలాగే ఈ తిరుపతి వేంకటకవులు చిన్నతనంలో బయలుదేరి నానా రాజ ఆస్థానాలూ చూస్తూ, వాళ్ళ కొలువుల్లో ధాటీగా నిలబడి 'ఇది మా ప్రజ్ఞ, నువ్వు ఏమంటావ్?' అని ఆశ్రితుల్ని అడిగినట్లుగానూ, అధికారిని హెచ్చరించినట్లుగానూ ప్రశ్నించడం, అదీ తెలియగానే మనకి ఒళ్ళు ఝల్లు మనేది.

ఎవ్వరూ ఎదిరించలేనివాణ్ణి ఒకడు ఎదిరిస్తే మనకు వల్లమాలిన సంతోషం, ఉత్సాహం కలుగుతాయి. వేంకటశాస్త్రి గారు 'నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నన్ గాని తత్సన్నిధిన్ స్థిరవాసం బొనరించు పూనికలు నాచే గావు' అని ఒక రాజు

ఆహ్వానం వ్రాసి పుచ్చినప్పుడు ఆయన కవి వీరుడిలా కనబడడూ?

ఆ రోజుల్లో వారు గావించిన సాహిత్య సమరాలు - తరువాతి స్వాతంత్ర్య సమరం ప్రజలకు ఎంత ఉత్సాహం కలిగించిందో - సంస్కారులకు అంత ఉత్సాహాన్ని కలిగించేవి. వారికీ, వేంకటరామ కృష్ణకవులకూ, కొప్పరపు కవులకూ జరిగే యుద్ధాలను గూర్చి తెలుసుకొనేదాకా, వీరూ వారూ వ్రాసిన పద్యాలు చదివే దాకా ప్రతి వారికీ మతి పోయినట్లుండేది. వీళ్ళూ వాళ్ళూ ఒకరిపై ఒకరు పద్యాస్త్రాలు ప్రయోగించుకుంటూంటే చిన్న భారతయుద్ధం అనిపించేది. ఇక్కడొక మాట. వారి ప్రతికక్షులైన వేంకటరామ కృష్ణ కవులు గూడా తక్కువవారు కారు. తక్కువ వారైతే ఆ యుద్ధం అలా సాగేది కాదు. వారిని గెలిచాం అన్న గౌరవం వీరికీ ఉండేది కాదు. వారు గూడా చక్కగా గొప్పగా అందంగా వ్రాసే వారు ఆ రోజుల్లో పద్యాలు. అయితే చెప్పా గదూ - సమయ బలం వీరిది!

తిరుపతి వేంకటకవుల కావ్యాలను గూర్చీ, అవధానాలను గూర్చీ, జీవిత విశేషాలను గూర్చీ పెద్దలు ప్రసంగించారు. వేంకట శాస్త్రిగారే వారి కావ్యాలన్నిటిలోకీ బుద్ధ చరిత్ర గొప్పదని నాతో ఒకసారి సెలవిచ్చారు. అదికాక వారి భారత నాటకాలలో గొప్ప పద్యా లున్నాయి. నన్నయ్య తిక్కనల భారతంతో బాగా పరిచయం ఉన్న తెనుగువారి మనస్సులను వీరి భారత నాటకాల్లోని పద్యాలు అంత గొప్పగానూ ఆకర్షించి ఊపుతాయి - అంటే వారి శక్తి మనకు కనబడుతుంది.

మా మిత్రుడు శ్రీశ్రీ తెనుగు కవిత్వంలో రెండు ధోరణు లున్నా యనిన్నీ, ఒకటి గాయకశైలి అనిన్నీ, రెండోది సంభాషణ

ఫక్కీ అనిన్నీ, నన్నయాది పెక్కండ్రు తెనుగు కవులది మొదటి ధోరణి అనిన్నీ, రెండోది తిక్కన, తిరుపతి వేంకట కవులు మొదలగు కొద్దిమంది దనిన్నీ నాతో అన్నట్లు జ్ఞాపకం. నాటకంలో పద్యం సంభాషణకు దగ్గిరగా ఉన్నట్లు అనిపిస్తే- అంటే సంభాషణలోనుంచి పద్యానికి, పద్యంలోనుంచి సంభాషణకు ఏ అవధిగాని, మెట్టుగాని లేనట్లు ఉంటే ఆ నాటకం చాలా బాగుంటుంది. బలిజేపల్లి లక్ష్మీకాంత కవి హరిశ్చంద్ర నాటకంలో పద్యాలు అలా ఉంటాయి. 'జటినై నే ననరాదు గాని' అన్న పద్యం లాగ.

తిరుపతి కవుల పాండవోద్యోగ నాటకాలూ, ఆ పద్యాలూ యాభై ఏళ్ళనుండి తెనుగువాళ్ళను పట్టుకొని ఇంకా నిలిచి ఉన్నాయి - చల్లారిపోకుండా. ఈ సంగతే చాలు వారి ఘనతను నిరూపించడానికి.

నానా రాజ అస్థానాలు సందర్శించి తిరుపతి వేంకట కవులే మహారాజుల కొలువునుండి ఆంధ్రకవితా సరస్వతిని సామాన్య మధ్య తరగతి వారి సభలలో ప్రవేశపెట్టారు. అది కూడా వారి ప్రభావానికీ, ప్రఖ్యాతికీ కారణం.

వారికి దేశ కాల పరిస్థితులకు సంబంధించిన ఒక మెలకువ కూడా ఉండేది. సమాజంలో జరిగే ప్రతి సంఘటన, ఊపే ప్రతి సమస్య, పట్టుకునే ప్రతి ఉద్యమం వారిని కూడా కదిపి వారిచేత పలికించేది. వారు వ్రాసిన ఆ వ్రాత నేటి యువక దృష్టికి ప్రతీపంగా కనపడవచ్చు. కాని ఆ మెలకువ మాత్రం కొత్త కాలం గుణం!

పాత తరంవారు, అంటే మాకు పూర్వులు, అంటే 19 వ శతాబ్ది వారు అని చెప్పతగినవారు అందరూ కూడా పెద్ద ఎత్తు

వారు. భారీ వ్యక్తులు. పెద్దకొండ లోంచి మలచి చెక్కినట్లు ఉండే వారు. ప్రతి రంగంలో పనిచేసిన ప్రముఖుడూ అంతే. వారికి ఒక ఆస్తిక్య బలం, జీవిత లక్ష్యం అన్నవి ఉన్నాయి. వారిలో వీరు ఒకరు. వీరికి కవిత్వం తపస్సు మాత్రమే కాదు, వీరూ కవిత్వం ఒకటే. ఒకచోట వీరు వ్రాస్తారు-'కవవార్ధం బుదయించితిన్' అంటూ మొదలు పెట్టి, ఆ కవిత్వం వల్ల మృత్యువును జయించా ననీ, రుజను జయిస్తాననీ! అది మనం నమ్మి తీరాలి. అట్టి వారికి, నిరంతరమూ వారిలాగ కృషి చేసే వారికి జబ్బు పడ డానికి గాని, చనిపోవడానికి గాని తీరిక ఉండదు.

వేంకట శాస్త్రిగారు 'నన్నేదైనా అను గాని నా కవిత్వాన్ని అనకు' అంటారు. కొందరం నా కవిత్వం నచ్చకపోతే పోనీ గానీ, నన్నేమీ అనకు' అంటాం. అయితే నిజానికి వేంకటశాస్త్రి గార్నన్నా, ఆయన కవిత్వాన్నన్నా చిక్కే - రెండూ ఒకటే గనుక!

ఇంక ఈ మూడు రోజులూ ప్రసంగించిన కవులు ఒకటి వదిలేసేరు. అది వారి గద్య రచన. వారు గొప్ప కవులు. అయితే పద్య కవిత్వంకన్నా కూడా వారి వచనం గొప్ప దని నా నమ్మకం. ఆ 'కథలూ, గాథలూ' చదవండి. అలాంటి వచనం ఏ ఇద్దరు ముగ్గురైనా వ్రాయగలరో లేరో! - అది శిష్టులు వాడే చిత్రమైన భాష. వెనుకటి పండితులు వాడేది. కథలూ- లోకోక్తులూ - జాతీయాలూ. అంత మనోహరమైన రచన సాధార ణంగా చదవం. నవల కంటె కూడా పట్టుకొని నన్ను లాక్కు పోతుంది వారి రచన. అది చదివితే చాలు, సంస్కృతాంధ్ర సాహిత్యాలతో మనకు కూడా ఎంతో పరిచయం కలగడం, వారి చిన్నతనం మొదలుకుని చనిపోయిన దాకా జరిగిన ఆంధ్ర సమాజ చరిత్ర తెలుసుకోవడం, ఆచారాలు, వ్యవహారాలు, పండితులు, ప్రభువులు, పట్టుదలలూ వాటన్నిటినీ గ్రహించడం జరుగుతుంది.

ఆంధ్ర వాఙ్మయంలో 'కథలూ, గాథలూ' చాలా గొప్పగా కన బడుతుంది. నాలుగు కాలాలపాటు ఉంటుంది కూడా.

వారి నవీనత అనేక విధాల గోచరిస్తుంది - సభా వేదికల్ని ఉపయోగించుకోవడం, పత్రికలకు వ్రాయడం మొదలైన వాటిలో. వారి రచనలు కృష్ణా పత్రికలోనూ, ఎక్కువగా ఆంధ్ర పత్రికలోనూ వచ్చే వనుకుంటా. వారి వచన రచనలకనీ, పానుగంటి వారి వచన రచనలకనీ పడి చూసే వాళ్ళం ఆంధ్రపత్రిక కోసం. ఈ రోజుల్లో పత్రికల బలం, ప్రభావం గ్రహించినవారు వారు. కనుక 'కథలూ గాథలూ' వంటి వారి అమృత రచనలను మన కందించిన ఆ పత్రిక లకు గూడా ఆంధ్రలోకం రుణపడి ఉంది.

దాదాపు పదేళ్ళ క్రితం వారిని మద్రాసు ప్రభుత్వం ఆస్థానకవిగా ఎన్నుకుంది. ఎన్నుకొని తాను గూడా ఆ గౌరవం పొందింది. వేంకటశాస్త్రిగారు అస్వస్థత వల్ల పదవీ స్వీకారానికి మద్రాసు పోలేదు. అది బాగానే ఉందనిపించింది. ఎందుకు వెళ్ళాలి ఆ కవి వీరుడు? తరువాత విజయవాడలోనే బ్రహ్మాండమైన ఉత్సవం చేసేరు వారిని గౌరవించడానికి. రెండు మూడు రాష్ట్రాలనుంచి ముఖ్యమంత్రులూ, విశ్వవిద్యాల యోపాధ్యక్షులూ- ఎందరో వచ్చి వారియెడ తమ కున్న గౌరవం తెలుపుకున్నారు.

అనా డొక చిన్న సంఘటన జరిగిందని విన్నాను ; తిరుపతి వేంకట కవులను గూర్చి విన్న ఇతర గాథలతో అది సరిపోతుంది. ఒక శిష్యుడు - మంచం పట్టి ఉన్న ఆయన దగ్గిరికి వెళ్ళి ఫలానా ముఖ్యమంత్రులూ, పెద్దలూ మిమ్మల్ని చూడ్డానికివస్తాం అంటున్నారు అన్నా డట. "సరే, 3 గంటలకు దర్శనం ఇస్తాం అని చెప్పు" అని ఆయన అన్నారట. ఏమో ఇది నిజం అవునో కాదో! నిజం అవడానికి వీలు ఉంది. నిజం అయితే బాగుంటుంది కూడా

అనిపిస్తుంది. కాస్త అక్షరజ్ఞానం గల ప్రతివాడికీ గర్వం కల్గిస్తుందీ కథ.

ఆంధ్రపత్రిక (10-4-1960)
సారస్వతానుబంధంలో ప్రకటితం.

# ఆస్థానకవి పట్టభద్రుడు వేంకటశాస్త్రి

చెళ్లపిళ్లవారు ప్రజా ప్రభుత్వపు ప్రథమాంధ్రాస్థాన కవిగా నియమితులైన సందర్భంలో వ్రాసినది – 1949 లో.

మన ఆస్థాన కవి శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రులవారు.

"తిరుపతి అతండు, వేంకటేశ్వరుడ నేను,
వెరసి తిరుపతి వేంకటేశ్వరుల మేము"

అని చెప్పుకుంటూ, ఒక అర్ధశతాబ్దికి పైగా తెలుగువారికి కవితావేశం కలిగించిన జంటకవులలో వీరొకరు. తిరుపతి శాస్త్రిగారు ఆ 'Invisible Choir' (అదృశ్య మహాకవుల) లో కలిసిపోయినారు. అయినా నన్నయ తిక్కనాదులతో చిరంజీవులుగానే ఉన్నారు. వేంకటశాస్త్రిగారు మన అదృష్టం వల్ల సహస్ర మాస జీవులై ఇప్పుడు బెజవాడలో వేంచేసి ఉన్నారు.

ఇదివరకే నానా రాజన్యులూ, సామంతులూ, విద్వాంసులూ, వారిని కవితా పట్టభద్రులుగా అంగీకరించారు. ఇప్పుడు మన ప్రజా ప్రభుత్వం కూడా వారికే పట్టం గట్టింది. ఇప్పుడు మన భారత దేశంలో ఒక్కొక్క రాష్ట్రం వారు ఒక్కొక్క మహాకవి పేరు ఎప్పుడూ స్మరించుకుంటూ, "ఇతడు మాకు చైతన్యం ఇచ్చి, జాతి గౌరవం నిలబెట్టిన వాడు" అని చాటుతున్నారు. అలాగే ఆంధ్రులు

వేంకటశాస్త్రిగారిని కవితా పట్టాభిషిక్తుల్ని జేసి, భారతీయ మహాకవుల ప్రథమ శ్రేణిలో వారిని దర్శించు కొంటున్నారు. ఆంధ్రజాతికి క్రొత్త గౌరవమూ, గర్వమూ, ఐకమత్యమూ కలిగించే సంఘటన ఇది.

వారి 'శ్రవణానందము'లో మధుసూదనుడులాగ 'సుకవి సుందరుడై' శతావధానాదులు చేస్తూ జైత్రయాత్ర చేసిన సమయంలో వారిని నేటి ఆంధ్రులలో చాలమంది ఎరుగరు. ఆంధ్రదేశం నలుమూలలా వారు కవితా వర్షంతో అర్ద్రం చేసిన ఆ గొప్పరోజుల్లో వారి దర్శనం చేయలేకపోయాం. వారి శిష్యులలో ఒకరు చెప్పినట్లు అవధాన సమయంలో వారు విశ్వమూర్తులై, సభ్యులు వెంటాడు భక్తులైనప్పుడు వారు ఎలాగ సాక్షాత్కరించేవారో మనకు తెలియదు. వారి సాహిత్య సమరాల గాథలు వింటూ, వాటిలో పాల్గొంటూ దేశంలో అక్షరాస్యు లందరూ వివశులై పోయే వారట!

"కొండల నోర జేసికొని కొంత వడిన్ బరతెంచి, అంత ఉ
ద్దండత దారి కడ్డమయి తాకి హళాహళి సేయు కొండలన్
పిండిగ జేసి రైలు కడు వేగముగన్ చను తెంచునట్లు -"

అప్రతి హతంగా పరుగెత్తే వారి కవితా గౌతమిలో ఓలలాడుతూ వారి చరణ సన్నిధానంలో శిక్షితులై కవులై, మహాకవులై, వారంత వారైన వారి 'శిష్య చూడామణులు' ఆ కథలు ఇప్పుడు చెప్పుతున్నపుడు, తిరుపతి వేంకటేశ్వరులే వేరొక చోట అన్నట్లు- ఇప్పుడు "శారత చచ్చె కవీంద్రులందు" అనిపిస్తుంది.

కాని వేంకటశాస్త్రిగారి వెనుకటి గాథలే తలుచుకుని మనం సంతృప్తి పడనక్కరలేదు - ఇప్పటికీ వారి రచనా స్రవంతి అవిచ్ఛిన్నంగా సాగుతూనే ఉన్నది. సాగుతూ ఈ నాటి యువకుల్ని

గూడా ఆకర్షిస్తున్నది. "బుద్ధచరిత్ర", "శ్రవణానందము", "పాణి గృహీత" మొదలైన కావ్యాలలో ప్రత్యక్షమయ్యే వారి కవిత్వశ్రీ అలా గుండగా, వారిలో ప్రకాశించే గొప్ప గుణాలు మరి కొన్ని ఉన్నాయి.

వారికి కవిత్వమూ, జీవితమూ ఒకటే! వారు సాహిత్యాంగణంలో కాలు పెట్టిన కాలంలో కవిత ముసలి తనపు మమతతో పూర్వ గాథల్ని నెమరు వేసుకునేది; దాసీభావంతో రాజుల నగరులలో ఊడిగం చేసేది. దానికి జీవ చైతన్యం ఉండేది కాదు. వీరు కవి తకీ, జీవత్సమాజానికీ ముడి పెట్టి సామంతుల సదస్సులలోనే కాక సామాన్యుల సభలలోనూ, రచ్చ బావడులలోనూ కవితోత్సవాలు కావించారు. 'నానా రాజ సందర్శనం' చేసినప్పటికీ, వీరెప్పుడూ రాజాశ్రితులు కారు. "రాజమిత్రులు, మదికాక రాజ బంధువులము" అని ప్రారంభించి, 'కవిరాజులము' అని సుస్థిరంగా నిలిచి, "పదు వురు కలట్టి కులము వారము" అని చెప్పుకునే భాగ్యం పొందారు. "కవితా లతాంగికిన్ ధనము ప్రధానము" కాదంటారు; రసికత ప్రధాన మంటారు. "కనకాభిషేకమా కాక, జగమ్ము సమస్తము ధారవోతురే" కాక, మాకు ఆనంద మీయ దంటారు వేరొక చోట "నరనాథుల్ పది మంది మిత్రులయి యున్నన్ గాని తత్స న్నిధిన్ స్థిరవాన మ్మొనరించు పూనికలు నాచే గావు" అని మరొక చోట. అంటారు. "స్వతంత్రుడన్ చిదానందుడ," నొకనిని నాయకునిగా వరింప నంటారు.

మరి ఈ మధ్యనే హైదారాబాదు సంఘటనలకు పూర్వము వ్రాసిన పద్యాలలో – "పృథివీ పతి విష్ణువు, అబలులు ప్రజలు, వాని పాదరేణువులు" అనేవి ప్రాబలుకు లనిన్నీ, అవి ఖిలమై పోయిన వనిన్నీ, ఇక ముందు రాజు ఒకడు కాడనిన్నీ, ప్రజల కష్ట

సుఖమ్ములు ప్రజల కెరుక గాని రేనికి తెలియుట కల్ల గాన, ఒకనిపై రాజ్యపాలన ముండ దింక'' అనిన్నీ వారంటారు.

దీనిని బట్టి ఉత్తమ సనాతన సంప్రదాయాలకు దూరులు కాకుండా, ప్రబుద్ధమైన నవ మానవ సమాజానికి వీరు సన్నిహితులుగా ఉంటున్నారని కూడా స్పష్టమౌతుంది.

దీని కంతకీ కూడా కారణం వీరి తారుణ్యం. కవి నిత్య యౌవనుడు వానికి జరలేదు. మృతి లేనేలేదు కదా! ''సనాతనమైన వెలుగు ఎప్పుడూ తరుణమే: చీకట్లు పుట్టడమే ముదిసి పుడతాయి'' (Light is young, the ancient light; shadows are of the moment, they are born old) అని రవీంద్ర గురుదేవులన్నారు. కవి ఎప్పుడూ వెలుగు వైపు, అంటే సత్యం వైపు సుస్థిరుడై ఉంటాడు. జరా, మృతీ అసత్యాలు. కవిత సత్యం.

''కవనార్థం బుదయించితిన్, సుకవితా కార్యంబె నావృత్తి ఈ
భవ మద్దాన తరింతు, తద్భవమ మద్భాగ్యంబు సర్వంబు, మృ
త్యువు నే దాన జయించితిన్, రుజ జయింతున్ దానిచే''

అని వేంకటశాస్త్రిగా రంటారు. రవీంద్ర కవి ఒకరు, బెర్నార్డు షా ఒకరు - వీరికి కావ్యోత్సవంలో, అంటే నిరంతర కార్యోత్సవంలో వ్యాధికి లోగడానికి గాని, మృత్యు వంటే వెరవడానికి గాని తీరిక లే దను కుంటాను.

వ్యాధులలోని కల్లా పెద్ద వ్యాధి సోమరితనం. దానివల్ల నిరాశ, దిగులూ, పనికి మాలినతనమూ, రోగమూ, చావూ వస్తాయి. జాతికి కూడా సోమరితనం మృత్యువే అవుతుంది. సోమరితనమూ, భయమూ కూడా అక్కచెల్లెళ్లు. అవి లేనివారు ముక్తులు. అవి లేని కవులు మాత్రమే ముక్తకంఠులు.

"నాకు జీవితమంటే చిన్న వత్తివంటి చిరుదీపిక కాదు ; మహోజ్జ్వలమైన కరదీపిక అది. దానిని ఉజ్జ్వలతరం చేసి రాగల తరాల వారికి ఈయడం నా విధి" అని ఒక కవి అన్నా డంటారు.

వేంకటశాస్త్రిగా రటువంటి వారు. ఈ నడుమ వీరి దర్శనం చేయలేదు గాని వడిలి వట్టి వత్తి లాగ మంచాన్ని అంటి పెట్టుకున్న వీరి శరీరంలో ఎన్నభై వసంతాలు నృత్యం చేస్తున్నాయా అన్నట్లు అనిపిస్తుంది - వీరి రచనలను చదివినా, అసాధారణ ధారణా పాటవాన్ని చూసినా.

"కాలము లోగదు మనకున్,
కాలమునకు మనము లోగగా వలయును"

అని శాస్త్రిగా రొక చోట చెప్పినా, వారు కాలాన్ని జయించి, ఈ "భూ భువన మధ్య స్వర్గ ఖండ" మైన తెలుగు నేలలోనే త్రిదశులుగా, అమర్త్యులుగా ఉన్నారు.

వీరిలో నవ్యత మరికొన్ని శక్తులలో కనిపిస్తుంది. వ్యాకరణ శాస్త్రం వడకట్టి త్రావిన వీరు నిరంకుశులై కొత్త ప్రయోగాలు చేయడానికి వెనుదీయరు ; ఇంగ్లీషు మొదలైన అన్య భాషా శబ్దాలు అమోఘంగా ప్రయోగిస్తారు. ప్రజకి లాగే భాషకి ప్రాణం ఉందనీ ప్రాణం ఉన్నది మారుతూ ఉంటుందనీ, ప్రాణం ఉండి మారేది పలుకుతూ, పలకరిస్తూ ఉంటుందనీ వీరికి తెలుసు.

అంతే గాకుండా, ఈ కొత్త యుగంలో వచన రచనలో ఉన్న బ్రహ్మాండమైన శక్తి, గడసరులూ, ప్రతిభాశాలులూ అయిన వీరు గ్రహించారు. ఇంక ఆ వచనం వ్యావహారికమే. అ త్యుత్తమ సంస్కారి అయిన మహా విద్వాంసుడు వ్రాసినట్లు హుందాగా నిర్దుష్టంగా ఉంటూ, జాతీయంగా ఉండి, జీవం ఉట్టి పడ

తున్న ట్లుంటుంది వీరి వచనం. ఏ విషయాన్ని గూర్చి వ్రాసినా, కూర్చుని వ్రాసిన ట్లుండదు. ఆ వృద్ధ పండితుడే పద్మాసనం వేసుకుని కూర్చుంటే, ఎదురుగా మనం నిలబడి ఉంటే, 'విన్నావా?' అన్నట్లు సంభాషణలో దింపి, పాతగాథలూ లోకవృత్తాలూ, సాహిత్యానికి సంబంధించిన మెలకువలూ వింతలూ ఉపదేశిస్తున్నట్లు ఉంటుంది.

మరి వీరు పత్రికారచనా ప్రభావం కూడా పూర్తిగా గ్రహించిన వారు. ఈ యుగంలో పత్రికకీ ప్రసంగ వేదికీ ఉన్న ప్రాభవం మరి దేనికీ లేదు. మొన్న మొన్నటి దాకా వీరు ప్రసంగ వేదిపై ఆసీనులై గంటల తరబడి మాట్లాడుతూ ఉంటే, పండిత పామరులతో నిండిన మహాసభ ఊపిరి వదలకుండా ఉండేదట! బొట్టూ, కట్టూ, శాలువా పాతకాలపు ధోరణివి; పండితుడు; అంత ఆకర్షించే ఆకారమూ కాదు; ఊరికే పొరలి వచ్చే రాజకీయ ప్రసంగం కాదు; సన్నగా, సాపుగా, మెదడుకి చక్కిలి గింతలు పెడుతూ, పొడుస్తూ, లాలిస్తూ, నర్తిస్తూ, ఉపదేశిస్తూ మాట్లాడుకు పోవడం. కళ్లు మాత్రం సూదుల్లాంటివి. ముక్కు అసాధారణమైంది.

పద్యం చదవడం అత్యద్భుతమైనది. వీరి నోట వచ్చే పద్యం మనుష్యుడయి, నొక్కుతూ, సడలుతూ, ముక్కుతూ, మూల్గుతూ, ఒయ్యారంగానూ, హొయాదాగానూ నడుస్తూ, కష్ట సుఖాలు చెప్పు కుంటుంది. అందుకనే వీరి సన్నిధానంలో తెనుగువారు వివశులై, వీరు విశ్వమూర్తులైతే, తాము వెంటాడే భక్తులై కిమ్మనకుండా ఒక యాభైఏళ్లు వారి నోటి వెంటవచ్చే మాట వింటూ పూజించారు.

బుద్ధచరిత్రాది మహాకావ్యాలలో ప్రత్యక్షమయే వారి మహా కవితాశక్తికీ, వారి వైదుష్యానికీ, వారి ధారణాశక్తికీ, వారి తారుణ్యానికీ, నిత్య నవ్యతకీ, కాలంతో కూడా సాగుతూ వచ్చే

వారి జీవద్త్రప్రతిభకీ, వారి నిరంతర కావ్య కల్పనా మహెూత్సవానికీ, కవితని మహెూద్యమంగా చేసి తెనుగునాటిలో నవకవుల కంఠాలకి దివ్యపక్షాలు తొడిగిన వారి శక్తికీ, వారి సత్యనిరతికీ, వారి ధీరతకీ, వారి కవితా తపస్సుకీ, ఆంధ్రవాఙ్మయ జగత్తులో వారి కున్న శాశ్వత స్థానానికీ, వారు మనకి ప్రసాదించి, ప్రసాదిస్తున్న కావ్య రత్నాలకీ ముగ్ధులై, కృతజ్ఞులై, ముక్కోటి ఆంధ్ర ప్రజ తమ ప్రభుత్వం ద్వారా నేడు ఆస్థానకవి పట్టం వేంకట శాస్త్రుల వారికి కట్టుకున్నారు....

# పానుగంటి

పానుగంటి అంటే పానుగంటి లక్ష్మీ నరసింహారావు. స్వగ్రామం పిఠాపురం; ఈ మధ్య దాదాపు ఒక యాభై సంవత్సరాలు ఆంధ్ర సాహిత్య రాజధానుల్లో పిఠాపురం ప్రసిద్ధం. ఊరు చిన్న ఉజ్జయినిలా గుండేది. దానిలో ప్రస్ఫుటంగా కనపడే ఒక వ్యక్తి పానుగంటి. అతనిది విచిత్ర ప్రతిభ.

ప్రసిద్ధ సాహితీపరుల్లో అందరికీ అసలు ప్రతిభ అనేదే ఉండదు. చాలా మందికి కొంత సామర్ధ్యం (talent) ఉంటుంది. దానికి బోదె తవ్వి, నీళ్లు పోసి, పందిరి వేసి, పాకించి కష్టపడి కాయలూ పువ్వులూ కాయిస్తారు. కొందరు కాగితపు పువ్వులూ, కర్ర పళ్ళూ తయారు చేస్తారు. కొద్దిమందికి మాత్రమే ప్రతిభ (genius) ఉంటుంది. దానికి స్వతహాగా వేడీ, వెలుగూ, వేగమూ ఉంటాయి; జీవత్సృష్టి చేసే పటిమ దానికి నిసర్గంగా ఉంటుంది. దానికి వ్యుత్పత్తీ, అవిశ్రాంతాభ్యాసమూ కూడా కలిస్తే అభూత కావ్య కల్పన జరుగుతుంది. పానుగంటిలో ఈ మూడు గుణాలూ ఉన్నాయి.

పానుగంటి బి. ఏ. దాకా చదివాడూ అంటే అంత మునిగి పోయినంత విశేషంగా కనపడదు మనకి. అన్ని పంటలకంటె

మన దేశంలో బి. ఏ.ల పంట అధికమయింది. ఉద్యోగం కోసమో, ఊసు పోకో కావించే ఉత్తుత్త ఓటిచదువు ఒకటీ, సాహిత్య హృదయమూ, సంస్కృతీ తనదిగా చేసుకునే గడసరి చదువు మరొకటీ. రెండో రకం పానుగంటిది. గట్టి చదువు, గట్టి చదువు అంటే గడ గడ లాడించే కర్కశ పాండిత్యం కాదు. అది పెద్ద కిరీటమో, భుజకీర్తులో వంటి భూషణం. పానుగంటి విద్య గాలీ, నీరూ, ఆహారమూ వంటిది - లోపలికి పోయి జీవ చైతన్యంగా మారిపోతుంది.

ఆ రోజు వరకూ వచ్చిన ఆంగ్ల సాహిత్యంతో లోతైన పరిచయం, గీర్వాణ వాఙ్మయంతో గాఢ స్నేహమూ అతనికి. ఆంధ్ర సారస్వతం తన సొంత సొత్తే అయెను!

కనుక తన ప్రతిభ పనిచేయడానికి కావలసిన సామగ్రిలో ముఖ్యమైన వ్యుత్పత్తి సంపాదించాడూ అన్న మాట! అలాంటి సామగ్రిలో ముఖ్యమయింది మరొకటి ఉంది; చాలా ముఖ్యం, అత్యవసరం. అది లోకజ్ఞత. పానుగంటి కొన్ని సంస్థానాల్లో ఉన్నతోద్యోగం చేసేడు. ఆ సంస్థానాల్లో జమీందారు మొదలుకొని జవాను దాకా, ఆస్థానకవి మొదలుకొని అమ్మగారి దాసీ దాకా అందరి ప్రకృతుల్లోకీ, వేష భాషల్లోకీ, ఆచారాల్లోకీ, అసత్యపు పై పూతలు ఒలిచీ ఒలిచీ, అంతరాల్లోకి దొలిచీ దొలిచీ పెల్లగించి చూసేడు. అదీ కాకుండా ఏ మేడ మీదో ఎవరితోనూ సంబంధం లేనట్టు ముడుచుకుని కూర్చుండే మనిషి ఏ నాడు చూసేడో పశువుల సంతలూ, తోలు బొమ్మలాటలూ, అమ్మవారి జాతరలూ! ఈ ఆంధ్ర జగత్తులో అతను చూడని వస్తువూ, ఎరగని విశేషమూ లేదు. సజీవ విజ్ఞాన సర్వస్వమో, సజీవ వస్తు ప్రదర్శనశాలో ఏదో అన్న మాట పానుగంటి. అంటే అందరు మనుష్యుల్నీ ఎరుగును; అన్ని సంగతుల్నీ ఎరుగును. ఈ లోకజ్ఞతలో మూడో భాగం

ఉంది. ఏ రోజు కా రోజు లోకంతో కూడా నడుస్తూ రావడం – ఎప్పటి పత్రికలు అప్పటికే చదవడం - ప్రపంచంలో యుద్ధాలూ, నీతులూ, విప్లవాలూ, శాస్త్ర పరిశోధనలూ, చిన్న సంఘటనలూ, వింత విషయాలూ, సభలూ ఏవీ వదలకుండా! వీటి అన్నిటిలో తనకు పనికి వచ్చేవి అన్నీ తన మనో మందిరంలో వేరు వేరు గదుల్లో జాగ్రత్తగా దాచుకుని ఉంచేవాడు.

కనుక ప్రతిభ ఉంది. దానికి కావలసిన వ్యుత్పత్తీ, లోకజ్ఞతా ఉన్నాయి. ఇంక ఇవి తుప్పు పట్టకుండా అభ్యాసమూ, కృషీ ఉన్నాయి. పానుగంటి సాహిత్య జీవితం ఒక యాభై ఏళ్ళ పాటు. నాటకం మీద నాటకం, వ్యాసం మీద వ్యాసం, అలాగ తెర్లుతూ పొర్లుతూ వచ్చాయి. ఇదంతా ఆస్థానపు టలస వాయువులు పీలుస్తూనే! ఆస్థాన ప్రభావంలో పడిన వాడికి జీవితం హాయి; కృషి కాదు, అనుభవ పరంపర; అనవరత సంగ్రామం కాదు, విశ్రాంతి. కాని పానుగంటి కృషికి విశ్రాంతి లేదు.

పానుగంటి ముఖ్యంగా నాటక కర్తా, వ్యాసరచయితానున్నూ. పానుగంటి అనగానే మన తెలుగు నాడులో పాదుకా, రాధాకృష్ణా, కంఠాభరణమూ వంటి నాటకాలూ, సాక్షి వ్యాసాలూ తోస్తాయి. ముందు – నాటకాల సంగతి. ఆయనవి పాతిక ముప్ఫై నాటకాల పైన ఉన్నాయి. వీటిలో మరీ ప్రజల్ని ఆకర్షించినవి సారంగధర, పాదుకా పట్టాభిషేకము, రాధాకృష్ణ, కంఠాభరణమూను. వీటిలో కొన్ని మాటలూ అవీ నేడు తెలుగువారి సంభాషణల్లో పులుపూ కారం లాగ కలిసిపోయాయి. ఇక్కడ ఒక్కమాట: పానుగంటి హైందవ జాతీయత పునరుజ్జీవిత మయే రోజుల్లో పుట్టి పెరిగాడు. అప్పుడు పుట్టిన రచయితలకి ఒక లక్ష్యావేశం ఉంటుంది. ఒక కాల్పనిక వేగం ఉంటుంది. వారిది రొమాంటిక్ యుగం. వారిలో అద్భుత రసం నిండి ఉంటుంది. ప్రతి వ్యక్తీ, ప్రతి వస్తువూ, ప్రతి

సంఘటనా గొప్పదై పోయి, వాసనలూ వన్నెలూ పూసుకుని సాక్షాత్కరిస్తుంది. ఈ గుణం కవిత్వానికి లావణ్యమూ, ఔన్నత్యమూ ఇస్తుంది కాని, నాటక రచనకి కావలసిన తాటస్థ్యమూ, వాస్తవికతా ఇవ్వలేదు. ఈ ఆవేశం వల్ల సంయమం (restraint) కూడా కొంత తగ్గుతుంది; మొట్టమొదటి రోజుల్లో మరీని!

పానుగంటి దూర గాథలు నాటక వస్తువులుగా తీసుకున్నాడు కనుక ఈ లోపం స్ఫుటంగా కనిపించదు మనకి. ఆయన రామాయణ నాటకాలు ఉన్నాయి. దూరాన ఉన్న కొండలూ, తోపులూ కలిసి కొద్ది హెచ్చు తగ్గులతో ఒక పెద్ద గోడలాగో పుంతలాగో కనబడినట్లు, తామే లక్ష్యాలు అయిపోయి, కృత త్రేతాయుగాల నుంచీ వస్తూ ఉన్న రామాదులు ఒకే ఒక పానుగంటి గొంతుకతో బాణీతో మాట్లాడుతూ ఉన్నా మనకు ఇబ్బందిగా, ఎబ్బెట్టుగా ఉండదు - కాని మంథరా, మహోదరుడూ ఒకే ఒక బాణీలో, భాషలో మాట్లాడతారు. అవి ఇప్పటి తెలుగు లోకపు భాషా, బాణీలకి విలక్షణంగా, వింతగా ఉన్నా బాలు మనకి. నేటి సాంఘిక నాటకం అయితే, ఇది పెద్ద లోపం అయిపోతుంది. కన్యాశుల్కం బలం అంతా ఈ లోపం లేక పోవడమే!

పానుగంటి నాటకాల్లో పూర్వ కాలంనుంచీ, అపరిచిత లోకం నుంచీ గొప్పవాళ్ళు వచ్చి మనకు ప్రసంగాలూ, హితబోధలూ చేస్తారు. మనం వింటాం. వినాలి! వాళ్ళు పెద్దలు. అందుకోసమే వచ్చా రాయెను!

అయితే పానుగంటివారి నాటకాల్లో ఒక గొప్ప శక్తి ఉంది. అది ఇది: గొప్ప కళా వేత్తకీ, నాటక కర్తకీ ఉండవలసింది– అది ఈ లోకం మీద ఉండే అనురాగం, సానుభూతీ! మానవుడి మీదే కాదు- పశువుల మీదా, పక్షిమీదా, చెట్టు మీదా, శిల మీదా కూడా!

ఇతని మెదడుకి ఎంత కుతూహలమూ, జిజ్ఞాసా ఉన్నాయో, ఇతని హృదయానికి అంత ప్రేమా, కరుణా ఉన్నాయి. ఎప్పుడూ అంచులు దాటి పొరలడమే ఆ అనురాగం - ఆయన భాషలాగ. పురుషోత్తములైన ఆచార్యుల్ని గూర్చి వ్రాసేడు, పుసుగుడు గాడి మీద వ్రాసేడు గదా పానుగంటి! వీరిలో ఎవరు లేకపోయినా అతనికి ఈ లోకం దుస్సహ మైపోతుంది. మాట మోటుగా కత్తి వేటుగా ఉంటుంది. కాని 'నిండుమనం' పాల కడవలాగ ఉంటుంది. అతని రచనలో కౌగిలింత కూడా కరకుగా ఉన్న ట్టుంటుంది, అంతే ! అంతా ఉత్తది. అన్నిటికీ అడుగున నిండుగా, నిదానంగా, కొట్టుకునే గొప్ప హృదయం- లోకమంత విశాల మయింది- ఉంది. అందుకనే ఆయన మంథరా, మహోదరుడూ కూడా మన కిష్టులే ! అంతే కాక, ఎక్కడెక్క డయితే, ఆ ఆ నాటక ఘట్టాల్లో మానవ హృదయం స్పందించాలో, ఎక్క డెక్కడయితే ఎప్పుడూ మానవుడిలో ఉండే యథార్థ ఆవేశాలు కదులుతాయో, అక్క డల్లా మన కళ్ళు కరుగుతూనే ఉంటాయి– దశరథుడు రాముడి కోసం ఏడుస్తూ చనిపోయినప్పుడూ, ఆంజనేయులు రాముడి యెడ భక్తి చూపిస్తూన్నప్పుడూ లాగ !

అయితే ఇదివరకు చెప్పినట్లు దీనిలోనూ సంయమం లేదు. కరుణ జనించినప్పుడు ఊరికే కళ్లు చెమ్మగిల్లవు ; బారు మని ఏడుస్తాం. నవ్వవలసి వచ్చినప్పుడు, ఊరికే పెదవి విరవం. విరగబడి వక్కలు పట్టుకుంటాం. అసలు వర్ణనలలోనూ ఉంది ఈ గుణం. ఒక్కణ్ణి నిదానంగా నడిపించలేడు. ఊరేగింపులో పారేస్తాడు.

ఇక్కడ పానుగంటి భాషా, శైలుల్ని గూర్చి. భాష మనం కృతక భాష అనే కావ్య భాషలా గుంటుంది. కాని అతని భాషకి వెలి అయిన మాటలు లేవు. శబ్దాల్లోనూ, వస్తువుల్లోనూ అస్పృశ్యమైనవి అతనికి లేవు. మాంచి వ్యావహారికంలో ఉన్నవి ఎన్నో శబ్దాలు ఏరి, అతి చాకచక్యంతో అనువైన పరిసరాల్లో వాట్లని ఇమిడ్చి,

కేవలమూ కావ్యభాషతో నప్పేటట్లు చేసెయ్యగలడు. కనుక అతని భాష ఉదాత్తత ఉంచుకుంటూ జీవంతో చలించి పోయేది. ఇంక ఆ శైలి వర్షావాహిని వంటిది. సెలయేరూ చిరుగాలీ వంటిది కాదు. హోరు మనడమూ, తరంగాలపై తరుముకుని తరంగాలూ; పైని చెట్లూ చేమలూ కలపా పడవా అన్నీ విసురుకుని పోవడమూ, మధ్య మధ్య సుళ్లు తిరగడమూ, ఎక్కడా ఆగనీయక పోవడమూ - అన్నీ అతని వాక్య నిర్మాణంలో ఉన్నాయి. పందెపు గుర్రం లాంటిది; ఎక్కామో, గుర్రం దయ ఉంచి ఆగాలి కాని, కళ్లెం - కడపలా ఉండవు. ఒకసారి రివ్వు మని ముందుకు సాగడం. ఒకసారి వెనుక కాళ్ళ మీద నిలబడడం, గిర్రున తిరగడం, తలవంచడం, నోట నురుగులూ, సకిలింతలూ - అంతా ఊపిరాడక పోవడమూ, వేగమూ, నిరంకుశ వృత్తీనీ. శబ్దార్థాలంకారాలూ, అనుప్రాసలూ అన్నింటితో నిండి, వనాలూ - కొండలూ - లోయలూ - నదులతో నిండిన ఒక భూఖండం లాగ ఉంటుంది ఆయన కావ్యలోకం. ఈయన రచనలో ఇంకో గుణం సాహసం - సమాస నిర్మాణం లోనూ, తెలుగు మాటలు కూర్చటంలోనూ, చప్పు విషయాల్ని ఉదాత్త భాషలోనూ, గొప్ప సంగతుల్ని పాడి పాడి పలుకులతోనూ అని, ఒక విలక్షణత సాధించడంలోనూ ఇది కనబడుతుంది.

ఈ లక్షణా లన్నీ పానుగంటి నాటకాల్లోనూ, వ్యాసాల్లోనూ కనబడతాయి.

ఇంక ఈయన కవిత్వాన్ని గూర్చి, పద్య రచనని గూర్చినీ. నిజానికి ఈయన పద్యాల్లో కన్నా వచన కావ్యాల్లోనే కవిత్వం ఎక్కువ దొరుకుతుంది మనకు. అసలు ఈయన వచన రచనల్లో కవితా ఖండాలు కత్తిరించి కొన్ని పెద్ద సంపుటాలు వేయవచ్చు. ఈయన వేరే పద్య కావ్యాలు వ్రాయలేదు. నాటకంలో పద్యం, పాట వాడడం అయిష్టం. కాని గీత పద్యం, సీసమూ వాడారు

బాగా. ఇవి రెండూ వచన రచనకి దగ్గరగా ఉంటాయి. నియమాలూ, బంధాలూ వీటికి తక్కువ. ఒక శిల్పంతో, ఒక ఊపుతో, విలక్షణమైన ఒక నడకతో సాగే వచనంలోనుంచి గీతంలోకీ, సీసంలోకీ సహజంగా జారినట్లు ఉంటుంది కాని, ఇంకొక అంతస్తు మీదికి ఉండదు. అందువల్ల గడసరి పానుగంటి వీటిని వాడాడు. ఇంక వీరి కవిత్వం భావావేశం, మన స్థితి, వర్ణన, వీటికి సంబంధించి కాదు. ఎక్కువ సంభాషణలాగ నాటక సంబంధమైనది- dramatic; కొన్ని చోట్ల declamatory. కాని రాధాకృష్ణలోనూ, రామాయణ నాటకాల్లోనూ తెలుగు సాహిత్యంలో నిలబడి పోయే పద్యాలు ఉన్నాయి. దశరథుడు వనవాసం పోయే రాముని గూర్చి ఏడ్చిన పద్యం, రాధ కృష్ణుడి మీద పాడేవిన్నీ! భావావేశంలో వచ్చిన కొన్ని మంచి lyrics కూడా ఉన్నాయి వీరివి.

ఇవి పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారి రచనల్ని గూర్చి కొన్ని మాటలు. వారి నాటకాలలోనుంచి ప్రత్యేకంగా ఏరీ, సాక్షి సంపుటాల్లోనుంచి ప్రత్యేకంగా ఏరీ విపులంగా ఎలాగ చెప్పడం ?

ఈ నాలుగు మాటలూ మిమ్మల్ని ప్రేరేపించి వారి గ్రంథాల్ని చదివేటట్టు చేస్తే, ఒక ప్రతిబాశాలి అయిన వ్యక్తి వంటి కవితో మీకు పరిచయం అవుతుంది.

# వేంకట పార్వతీశ్వర కవులు

'ఏకాంతసేవ' పీఠిక - 1922 ; 'కావ్యకుసుమావళి' భూమిక - 1943

ఇరుగ నీ నాటి కాంధ్ర సారస్వతమునకు వసంతోదయ మైనది; నవజీవము కలిగినది; నూతన రామణీయకము చేకూరినది. వల్లరుల కొక క్రొత్త సౌకుమార్యము, చివురుల కొక క్రొత్త మెత్తందనము, ప్రసవముల కొక క్రొత్త కమ్మందనము, మకరందమున కొక క్రొత్త మాధుర్యము, కలకంఠమున కొక క్రొత్త కంఠస్వరము - ఈ వసంతము వనలక్ష్మి కొక క్రొత్త శోభ, ఒక వింత సౌందర్యము, ఒక యపూర్వ లావణ్యము!!! ఆంధ్ర సారస్వత చరిత్రములో నొక నూతన శకము ప్రారంభ మైనది. కవులు బయలు దేరినారు, ప్రాఁత కవుల వంటి వారు గారు; గాన మొనర్చుచున్నారు, వెనుకటి వారి వలెఁ గాదు. విషయములో మార్పు, రీతిలో మార్పు, స్వరములో మార్పు. ఔను. కాలము మారినపుడు, కాలముతోఁ బరిస్థితులన్నియు మారినపుడు కవిత్వము మాత్రము మారకుండునా?

ప్రాచ్య పాశ్చాత్య నాగరకతా సమ్మేళనము వలన మనవారు క్రొత్తవా రైనారు. వీరికిఁ గొన్ని నూతనాశయము లలవడినవి. వీరిలోఁ గొన్ని విచిత్ర లక్షణములు కనుపట్టు చున్నవి. కవులలో

గూడ నంతే! ఆంధ్ర కవులలోఁ గూడ నంతే! వీరు పాశ్చాత్య సారస్వత పఠనము చేయనక్కఱలేదు; చేయకున్నను మారిపోవుచున్నారు; మారిపోవుచున్నట్టు లెఱుఁగకయే మారిపోవుచున్నారు; మారిపోవుట తప్పక మారిపోవుచున్నారు; వాతావరణముతో మారిపోవుచున్నారు. ఎట్లు?

నవ్య కవులకు స్వేచ్ఛ ప్రాణము. వీరు ప్రాణమైనఁ గోల్పోవుదురు గాని శృంఖలముల ధరింపరు. వీరికిఁ బ్రాణము కన్న గానము తీపు - సంకెలలో సంగీతమా? కట్టుఁబాటులోఁ గవిత్వమా?

మఱియొక చిత్రము. వీ రొకరికై కవనము చెప్పరు. వీరికి యశ మక్కర లేదు; ధనధాన్యములపైఁ గోర్కిలేదు; ఇతరు లానందింతురా యను నాతురత లేదు. వీరు గానము చేయుదురు. ఏల యన - గానము చేయవలయుఁ గనుక చేయుదురు. పాడుట వీరి కూపిరి పీల్చుట, విడుచుట - ఏల పాడుదురో వీరే యెఱుఁగరు. చందమామ యేల చంద్రికల వెదచల్లును? పూవు లేల తావుల విరఁజిమ్మును? నీర మేల పారును? తెమ్మెర లేల విసరును? కోయిల యేల గొంతెత్తి పాడును? పరులఁ దనియించుటకా? తన బాగునకా? పాడకున్న బ్రతుకు గడవకా?

వీరు ప్రకృతికి బిడ్డలు. ఆమె యొడిలో నిద్రింతురు; ఆమెకడ మాటలాడ నేర్తురు; ఆమెతో మాటలాడ నేర్తురు; ఆమె స్తన్యముఁ గ్రోలుదురు; ఆమెతో నాటలాడుకొందురు; ఆమెను గౌఁగిలింతురు. ఆమె చిఱునవ్వే వీరికి వెన్నెల. ఆమె పలుకులే వీరికి గోయిల కూఁతలు. ఆమె వదనమే వీరికిఁ జంద్ర మండలము. ఆమె చూపులే వీరికిఁ జుక్కలు. ఆమెయే వీరి సర్వస్వము. ఆమె పాడును; గర్జించును; ఆమె నవ్వును; బొమముడి వేయును. ఆమె కౌఁగి

లింపను ; దండింపను. ఎట్టిదైన నామెను వీరు విడువరు. వారిదములు, భూరుహములు, పులుఁగులు, పువ్వులు, మధుపములు, మారుతములు, నక్షత్రములు, నదులు వీరికిఁ గూరిమి నెచ్చెలులు ; ప్రాణ బంధువులు.

మఱియు వీరు ప్రకృతిని సులోచనములతోఁ జూడరు ; కనులతోఁ గాంచుదురు ; వీరు ప్రకృతికి దూరముగఁ దొలఁగిపోరు ; చెంతఁ జేరుదురు. వీరి ప్రకృతి పుస్తకములలోని ప్రకృతి కాదు ; వీరు ప్రతి నిముషముఁ జూచి ప్రేమించు ప్రకృతియే.

కనుక వీరి కీ విశ్వమునఁ బ్రేమింపఁదగనిది, గౌరవింపఁ దగనిది, వర్ణింపఁదగనిది యెయ్యదియు లేదు. ఘనాఘన గర్జనము, కప్ప కూఁత ; కలకంఠ రుతము, కాకి యఱపు ; కంజాతము, గడ్డిపోఁచ ; మృగరాజము, మూషికము - అన్నియు వీరికి సమానములే. అన్నిటిలో వీరు సౌందర్య మరయుదురు ; అరసి యానందింతురు. ఆనందించి గానము చేయుదురు. "సుందర మగు వస్తువే సంత తానంద దాయక" మని (A thing of beauty is a joy for ever - KEATS) గంతు లిడుదురు. షేక్స్పియ రన్నటుల వీరికిఁ బాదపములు భాషణములు ; సెలయేళ్లు పుస్తకములు ; శిలలు ధర్మోపన్యాసములు. వర్డ్సువ ర్తను కవి వాక్రుచ్చిన రీతి నెట్టి చిన్న పూవైనను వీరి హృదయముల గంభీర భావములను బుట్టించి కన్నీరు గురియింపఁ జేయును -

> To me the meanest flower that blows can give
> Thoughts that do often lie too deep for tears

మఱియు వీరికి సార్వభౌముని గాథ వలెనే సామాన్యుని కథ కూడ వర్ణనీయము. నిరుపేద నిట్టూర్పు, కలుషాత్ముని కన్నీరు, చిన్ని పాప చిఱునవ్వు, కన్నతల్లి కంటిచూపు, కాపుకన్నె కలికి

వలపు — ఇయ్యవి కూడ వీరికిఁ బ్రబంధము రచియింపఁ దగు విషయములే; ఒక్కొక్క దానిపై నొక్కొక్క కావ్యము విరచింతురు.

ఇట్టి వీరి కవిత్వమునకుఁ బ్రధాన లక్షణము లెవ్వి ? భావనాశక్తి (imagination) - బుద్ధిసూక్ష్మత కాదు, దానికంటె ఘనతరము భావనాశక్తి. ఇది కనఁబడని వస్తువులఁ గాంచఁ గలదు. వినఁబడని ధ్వనుల వినఁగలదు. పోవలేని ప్రదేశములకుఁ బోఁగలదు. దీని స్వచ్ఛంద విహారమున కీ విశాల విశ్వము చాలదు. ఒకసారి తారకా కాంతలతోఁ దాండవ మాడించును; ఒకసారి మున్నీటి తరఁగలలో ముంచివేయును; ఇఁక నొక్కసారి పవనునితోఁ బరువెత్తించును; మఱి యొక్కసారి వారిదములపైఁ బ్రయాణము చేయించును; ఇపుడు సుమములతో సౌరభముల గురియించును; ఇపుడు మధుపములతో మకరందము ద్రావించును; సెలయేటితో గల గల మనిపించును; పులుఁగులతోఁ గలకలపాడించును; బిచ్చగానితోఁ దిరిప మెత్తించును. రాజాధిరాజుతో సింహాసనారూఢుఁ జేయును; పాపాత్మునితో బాష్పములఁ బ్రవహింపజేయును; భక్తునితో బ్రహ్మసాయుజ్యము నొందించును. స్వరములో నేమున్నదో, సంచారములో నేమున్నదో, శిరఃకంపములో నేమున్నదో, చిఱునవ్వులో నేమున్నదో, హస్తచాలనములో నేమున్నదో, యపాంగవీక్షణములో నేమున్నదో యియ్యవియే కవికిఁ దెలియఁ బఱచును. మనస్సులో మనస్సును జూపించును. హృదయములో హృదయమును వ్యక్తపఱచును. మబ్బు, గాలి, పక్షి, తుమ్మెద మున్నగునవి దీని జాతిలోనివే. దీనికిఁ గాలముతోఁ బనిలేదు; స్థానముతోఁ బనిలేదు; వయసుతోఁ బనిలేదు: వస్తుతారతమ్యముతోఁ బనిలేదు; "బురదలోఁ బొరలు కీటకము కూడ నీశ్వర సేవఁ దలయెత్తు చున్నది" అని షెల్లీ చాటించినాఁడు:

The worm beneath the sod
May lift in homage of the God

రవీంద్రనాథుఁడు చాటినట్లు కాటికిఁ గాలుచాచిన కవి సర్వ సమ వయస్కుఁడే:

All have need for me; and I have no time to brood over the after-life. I am of an age with each, what matter if my hair turns gray.

భావనాశక్తియే కవిని నూతన పథముల విచిత్ర గతుల నడిపించును. అందు వలననే యొక మహాకవి వెఱ్ఱివానినిఁ, బ్రియుని, గవినిఁ గలిపి ముడి పెట్టినాడు:

> The lunatic, the lover, and the poet
> Are of imagination all compact.

వీరు గాలిలో మేడలఁ గట్టుదురు; ఆకృతులఁ గల్పింతురు; ఆ యాకృతులకు నామకరణ మొనర్తురు; నివాస స్థలము నిర్మింతురు. బ్లేక్‌ను వెఱ్ఱివాఁ డని లోకము నిరసింప లేదా!

కాని యీ కవుల భావనాశక్తి వెఱ్ఱివాని వికృత కల్పనా సామర్థ్యము కన్న మిన్న. మఱియు నున్నత హర్మ్యముల వర్ణించుచు, "నక్షత్రములు సౌధ గవాక్షముల లోనికి దూరి యచటి పిల్లలకు నాట వస్తువు లైన" వనుట వికృత కల్పన. "ప్రద్యుమ్నుఁడు చిలుకచేఁ బ్రియురాలికి సందేశముఁ బంపె" ననుట భావనాశక్తి. మొదటి దానిలో గొప్పలేదు; రెండవది కవిత్వమున కుండవలసిన ముఖ్య లక్షణములలో నొకటి.

ఈ భావనాశక్తి ప్రతి మానవునికిని గలదు. అట్టిచో నందఱును గవు లౌదురా? కారు. దీనితో నితర పరికరములు కావలయును. సౌరభము లెగఁ జిమ్ముటకు సమీరము కావలయును. తళతళ ద్యుతుల మెఱయుటకు వజ్రమునకు సానఱాయి కావలయును.

తన్మయీ భవన యోగ్యత, భావోద్రేకము (emotion) దీనికిఁ దోడు గావలయును. కవి నొక విధమగు నుద్రేక మూగింపవలెను; ఒక యావేశ మావహింప వలెను. "దుఃఖమో, మోదమో, కోపమో, వలపో, యీర్ష్యయో, భక్తియో" యతనిని మార్చి వేయవలెను. అతనిచే నతనినే మఱపింపఁ జేయవలెను. అట్టి సమయమున నతఁడు వలవల నేడ్చును; పకపక నవ్వును; పిచ్చి కేక లిడును; పాడును; నృత్యము చేయును.

"బాజాలురా నాన్న బాజాలు
బాజాలురా నాన్న బాజాలు
బాజాలతో వచ్చె పల్లకీ అదుగో
పల్లకీలో ఉంది పార్వతీదేవి
పార్వతీ దేవికీ జేజేలు పెట్టు
బాజాలురా నాన్న బాజాలు
బాజాలు వచ్చాయి బాజాలు"

అని గంతులిడు చిన్నిబిడ్డ కొంత వఱకుఁ గవి యగుచున్నాడు.

"ఎందుకైతే వుంచీనావో బందిఖానాలో"

అని మొఱపెట్టు రామదాసు కొంత వఱకుఁ గవి యగుచున్నాడు.

"జుట్టులో పువ్వులూ పెట్టుకున్నావా ?
ముత్యాల జూకాలు పెట్టుకున్నావా ?
గజ్జెల్ల మొలతాడు కట్టుకొన్నావా ?
వచ్చి ముద్దియ్యవే వరహాల తల్లీ !"

అని వాత్సల్య పరవశయై పాడు తల్లి కొంత వఱకుఁ గవయిత్రి యగుచున్నది.

"కంటికీ కాటు కెట్టి, కడవ చంకను బెట్టి
కన్నీరు కడవ నిండెను గదరా, చల్ మోహవరంగా
నీకు నాకు జోడు అయితే, మల్లెపూల తెప్ప గట్టి
తెప్పమీద తేలిపోదాం గదరా చల్ మోహవరంగా"

అని గాన మొనర్చు ప్రణయ స్వరూపిణి యగు పల్లెపడుచు కొంత వఱకుఁ గవయిత్రి యగుచున్నది.

"జీరంగి వీలయేణి విలసి మాట్లాడవే
విలసి మాట్లాడవే, కలిసి ముద్దు లియ్యవే,
పలకనైన పలకవేపంచదార చిలకవే"

అని తన ప్రేమోద్దేశము వెలువఱచు శబరకుమారుడు కొంత వఱకుఁ గవి యగుచున్నాడు.

"రెండు కాళ్లూ లేవు నారాయణా
రెండు కళ్లూ లేవు నారాయణా
కట్ట గుడ్డా లేదు నారాయణా
కుడువ కూడూ లేదు నారాయణా
నిలువ నీడా లేదు నారాయణా"

అని దైన్యముగా విలపించు భిక్షుకుఁడు కవివలె దుఃఖ తన్మయత్వము నొందుట లేదా ? కవిత్వమునకుఁ గావలసినది భావనా స్ఫోరకత్వము (suggestiveness), హృదయాకర్షణము, రసోజ్జృంభణము.

కాని యిట్టి పాటలకు సారస్వత చరిత్రములో శాశ్వత స్థానము, గౌరవ స్థానము లేదు. ఏలయన - వీనిని బుస్తకమునఁ జదివినప్పు డొక విలక్షణ మగు గానము వెలువడదు ; పాడినప్పుడే యివి బాగుగ నుండును. వీనిలో నొక కొఱఁత గలదు. చక్కని పదములు

లేవు ; కూర్పు లేదు. కవిత్వమునకు ఛందో బద్ధమగు మనోహర శబ్ద సముదాయము కూడఁ గావలయును.

కాని కేవలము గణ యతి ప్రాస నియమములు నిరర్థకములు ; అన్వ్యభా వాలంకారము లనావశ్యకములు. "కలము పట్టిన వారెల్లఁ గవులు కానేరరు. హృదయ భావముల వెలువఱుపకున్న, నుచిత రస పోషణముఁ గావింపకున్న నది కవిత గాదు. అష్టాదశ వర్ణనములు, తల దిరుగఁ జేయు కల్పనలు, బంధములు, పద్యములోఁ బద్యములు, ద్వ్యక్షర త్ర్యక్షర ప్రాసములు నిట్టి విచిత్ర శబ్ద చమత్కృతు లన్నియు వ్యర్థ వాక్యావళీ విడంబనమే కాని మనోహర కవితా గానము కాదు." సంగీతమునం దేమి, చిత్రలేఖనమునం దేమి, ద్వివిధములు కలవు. నయనములకో, శ్రుతిపుటములకో యానందము కలుగఁ జేయునవి కొన్ని-హృదయమును దన్మ యత్వములో ముంచివేయునవి కొన్ని. రవివర్మ పటములు మొదటి జాతిలోనివి, అవనీంద్రనాథ టాగూరు చిత్రములు రెండవ జాతి లోనివి ; కంఠమాధుర్యములేని సంగీతశాస్త్రజ్ఞుల రాగాలాపన మొదటి జాతి లోనిది, గవాయిపాట రెండవజాతి లోనిది ; వసుచరిత్ర మొదటి జాతి లోనిది, భాగవతము రెండవ జాతి లోనిది. ఆంగ్లేయ సారస్వతములో "పోపు" కవిత్వము మొదటి జాతి లోనిది, షెల్లీ (Shelley) కవిత్వము రెండవజాతి లోనిది. మొదటి రకము కంటె రెండవ రకము వేయిరెట్లు ఘనతర మని నా నమ్మకము.

అదియు గాక భావనా శక్తి యున్నపుడు, తన్మయీ భవన యోగ్యత కలిగి నప్పుడు పదము లప్రయత్నముగ (spontaneity) దొరలు చుండును. కవి వ్రాసి నటుల -

"భావనా బల మున్నది ప్రకృతి యున్న
దిష్ట ముండినఁ బదముల కేమి కొఱఁత ?"

"నదీ నద పదములు, కాసార పదములు, కేదార పదములు, సైకత పదములు, ఆశ్రమ పదములు, ఆరామ పదములు, పట్టణ పదములు" అన్నియుఁ బదములె; అందు వలననే యీ పరికరము లన్నియు సమకూడినపుడే పద్యములు వ్రాయవలెనని కొందఱందురు. యుద్ధనిధి సభలకో, కాంగ్రెస్సు సభలకో, యే దొరగారి మీఁదనో, యే సాహెబు మీఁదనో, యే సెట్టి మీఁదనో యరగంటలో మొదటి యక్షరములఁ జదివినచో నామము వచ్చునట్లును, తుది యక్షరములఁ జదివినచో దీవన వచ్చునట్లును "తయారు" చేయు పద్యములు పద్యములు కావు. సాధన సామగ్రి యంతయును సమకూడి నప్పుడే రచించు కావ్యములు మహోత్కృష్టములై యాచంద్రార్కముగ విరాజిల్లును.

తన పాటకన్నఁ గవి గానమే హాయిగా నున్నదని కోయిల యను కొను చున్నట్లు టెనిసన్ మహాకవి వ్రాసినాఁడు:

"... The nightingale thought
I have sung many a song but never a one so gay
For he sings of what the world will be
when the years have died away"

అట్టి కవన మీశ్వర వర ప్రసాదమే! దాని సౌరభము నాఘ్రా ణించుటకుఁ గవిరాజ చక్రవర్తి యగు నాతఁడే తన యూర్పు నట్టె యాపు నని యొక కవి కుమారుఁడు గర్వముతోఁ జాటినాఁడు:

God holds his swift enchanted breath
To catch the fragrance on the wind.

—*Harindranath Chattopadhyaya*

ఏకాంతసేవ యట్టి మహాగ్రంథములలో నగ్రస్థానము నలంక రించు వానిలో నొకటి. కవనమున కుండవలసిన లక్షణము లన్నియు

నిద్దానికి సంపూర్ణముగఁ గలవు. నూతనాంధ్ర సారస్వతములో నిట్టి కావ్యము వేఱొకటి లేదని నా నమ్మకము.

ప్రభాత సమయమునఁ బ్రియురాలగు భక్తుఁడు హృదయేశ్వరునిఁ గూర్చి కోయిలయై గొంతెత్తి పాడుట ; కళ్యాణగీతిలో నవశయై చిక్కిన కలకంఠిని గరుణించిన కళ్యాణమూర్తి కనుమొఱంగుటచే దుర్భర విరహానలములోఁ బరితపించు నామె ప్రణయాధినాథుని సందర్శనమునకై ప్రార్థించుట : "ఆత్మేశుతో నైక్య మందక యున్న నొక్కింత సే పైన నోపని యామె ప్రణయ స్వరూపుని బట్టి తెచ్చుటకు, బ్రణయవనంబు లోపలి పుష్పరథములో" భ్రమరమే బాసటగా బయలుదేరుట ; "పదిలమగు పాణిద్వయముతో, నిశ్చలమగు నేత్రయుగముతోఁ, జెదరని చిత్తముతో, స్వామి నర్చించు పూజా ద్రవ్య సమితితో" నామె యాయత్తయై యుండుట ; "శ్రీ పుష్పయోగ సంసిద్ధి" చేకూరుటయు, యుగ యుగంబులనుండి మ్రోఁగు ననంత విశ్వగానము - నిత్య నూతన గానము - మఱల మఱలఁ బాడినదే పాటగా నామె పాడుట....ఇయ్యది

"మధురముగ, మార్దవంబుగా, మంజులముగ
మాన సానందకరముగా, మంగళముగ"

మధుర పదజాలముతో మనోహరముగ వర్ణింపఁ బడినది. "నెమ్మి నెఱజాణ లాటకత్తెలుగా, కోయిలలు తోడిగాయకులుగాఁ, దేఁటిరొద శ్రుతిగా, నందనవనమునను, మందాకినీ తీరమునను, ప్రభాతసమయమునను, చంద్రికా పులకిత యామినులను, నింగిపై నీలాలపేరు వ్రేలునట్లు, విశ్వమంతయు వెన్నెలతీఁగ ప్రాఁకునట్లు, దిక్కులన్నియు దివ్య గానములతో నిండునట్లు, ప్రకృతి యంతయుఁ బరవశయగునట్లు" ప్రవిమల భక్తి యుక్తుఁడైన భక్తుడు పరమేశ్వరునిఁ గూర్చి పాడు ప్రణయగీతము, ఇది భాగవతము వలెనే పఠింపఁ దగినది ; ప్రేమింపఁ దగినది ; శిరసావహింపఁ దగినది.

వేయేల? ఇది విమర్శనాతీతము. వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్రమున కీ మహాకవుల - భక్తుల యేకాంతసేవ యట్టి దని నా యభిప్రాయము.

## వేంకట పార్వతీశ్వర యుగం

"గాన మాతనిది చొక్కంపు బైన శ్రుతి వాది
సరస మోహన కలస్వనము మాది ....

చోద్యముగ బాడు వాతండు చూపులోనె
పట్టి యాడెద వే గనుపాపలోనె" —

—కవిద్వయము, 'కావ్యకుసుమావళి'

శ్రీ బాలాంత్రపు వేంకటరావు గారు, శ్రీ వోలేటి పార్వతీశము గారు - వెరసి శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు.

అన్నదమ్ములు కారు; అంతకన్న దగ్గరవారు.

ఆవేశము వచ్చినప్పుడు ఒకరి కళ్లు అగ్నికణాల్లాగ తళతళ మంటాయి; రెండవ వారి కళ్లు శ్రావణ మేఘాల్లాగ తడి తడిగా ఉంటాయి. ఒకరిది అధికారపు ధోరణి, రెండవ వారిది అనురాగపు సరణి.

ఈ చర్మచక్షువుల కందరాని పొలిమేరలను దాటిపోయిన జీవితేశ్వరి తన అంతరంగములోనే ప్రవేశించి అక్కడ నిండిపోయిన దనిన్నీ, అందువల్ల అనగా స్త్రీ పురుష స్వభావాల సమ్మేళనము వల్ల తన ప్రకృతి సమగ్రసుందర మైన దనిన్నీ, ఒక మహాకవి వ్రాసేడు.

ఆ విధముగా కాకపోయినా, అనవరత సాహచర్యమువల్ల ఈ కవులలో క్రమ క్రమంగా ఒకరి ప్రకృతి ఒకరిని ఆవహించి, ఒకరిలోనికి ఒకరు ప్రవేశించి, ఎవ రెటువంటి వారో వరమాప్తుల

పరిశీలనం గూడా పసికట్ట లేనట్టుగా ఇద్దరూ సమగ్రంగా వికసించి, సరిగ్గా ఒక్కరే, ఒక్క మహా కవే అయి ఊరుకొన్నారు.

ఊరుకొన్నారా! ఆంధ్రసాహిత్యాకాశాన్ని రమారమి ఒక తరం అవ్యక్త మధురగానంతో నింపివేసేరు.

అసలు మనకు వేంకట పార్వతీశ్వర యుగ మని ఒకటి ఉన్నది.

దాదాపు పాతికేళ్లకు పూర్వం ఆంధ్రలోకంలో వేంకట పార్వతీశ్వరుల ప్రభావం ఎంత అధికంగా ఉండేదో ఇప్పుడు గ్రహించడం కష్టం. ప్రభాత ప్రాంగణం వైపు దృష్టులు సారిస్తూ నూతన యుగానికి స్వాగతం ఇచ్చే ప్రతికవికీ వీరి కావ్యజగత్తులోనుంచి పసిడి పూతలూ, పక్షుల కూతలూ ముందుగా ఎదు రయ్యేవి.

అప్పుడు ఎందరో నవ కవుల మీద వీరి పలుకుబడి ప్రసరించింది. నా కవితాలయంలోనూ ఒక గవాక్షం వీరు తెరిచారు.

దానిలోనుంచి పచ్చని తోటలూ, పైరుచేలూ, దూర గగన ఖండాలూ అప్పుడు ఆశ్చర్య చకితుణ్ణయి చూసేను.

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, గ్రంథాలయ సర్వస్వము, ఆంధ్ర భారతి, అనసూయ, కల్పలత – వీరి ఖండకావ్యం లేని పత్రిక ఉండేది కాదు. ఇక ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలనుంచి వచ్చే వీరి నవలలు కవిత్వంలాగే ఉండేవి.

అసలు వాటిలో కూడా ఏ భిక్షుకుడో, ఏ విరహిణో పాడే గీత మాలికలూ, చిన్న చిన్న గేయాలూ ఉండేవి. వీ టన్నిటి కోసమూ ఎంతో ఆత్రతతో, ఆకలితో ఎదురు చూసేవారం.

వీరు ఉషఃకాలపు కవులు, తొలి వైతాళికులు.

వీరి కావ్యం చదివినప్పుడు తెల్లతెల్లవారగట్ల పెళ్లివారిని ప్రబోధించే గొప్ప సన్నాయి పాట ఎందుచేతో నాకు జ్ఞాపకం

వస్తుంది. ఆ శ్రావ్య ధ్వని వల్ల మేల్కొని, తూలిపడి, కళ్లు నులుము కుంటూ ప్రాంగణంలోనికి రాగానే పచ్చని పందిళ్లూ, ఆకుపచ్చని తోరణాలూ, కల్యాణ కలకలమూ, అన్నింటిలోనూ ప్రభాతోత్సవమూ మనకు సాక్షాత్కరిస్తాయి.

వీరు మధూత్సవ ప్రారంభకులు; దక్షిణ ద్వారం తెరవగానే మంగళ తూర్యాలు ప్రయోగిస్తూ ముందు వీ రివతల కడుగు పెట్టారు; వెంట వెంటనే వసంతుడు ఊరేగుతూ ప్రవేశించాడు.

అప్పటి ఆవేశానికి సంయమం ఉండదు; పారవశ్యానికి పరిమితి ఉండదు. ఆలాపనకు అవధి ఉండదు. శిరస్సు ఊపుకొంటూ ఊరికే పాడుకు పోవడమే. గూడుమాట మరచిపోయి భావన ఎంత ఎగిరినా అలసిపోని రోజు లవి.

వీరు ఎంత పాట పాడారు! ఎటువంటి పాట పాడారు!

అవి గొప్ప రోజులు - ఇవి మరీ గొప్ప దినాలు.

నా కెప్పటి కప్పుడు ముం దున్నదే కృతయుగం. భగవంతుని అనుగ్రహ విధానంలో అభ్యుదయ మార్గాన్ని నడవడమే గాని మన మెంత గిలగిల లాడి ప్రతిఘటించినా వెనక్కి మాత్రం వెళ్లలేము.

ఒక వ్యక్తి జీవితంలో లాగే ఒక జాతి జీవితంలో గూడా మధ్య మధ్య మగత వంటిది, నిద్ర వంటిది ఏదో కమ్ముతుంటుంది. హ్రస్వ దృక్కుల కది మృతస్థితా అనిపిస్తుంది.

నిజానికి కాదు. పాథేయం సేకరించుకొనడానికీ, కాస్త విశ్రాంతికీ ఆ రాత్రికి ఆ సత్రంలో మజిలీ వంటి దది. ఉదయాన్నే ఉజ్జీవనం.

ఆంధ్రసాహిత్య చరిత్రలో ఒక నిద్రావస్థ పోగానే, ఒక మజిలీ కాగానే శ్రీగురజాడ అప్పారావు గారూ, శ్రీ వేంకట పార్వతీశ్వర

కవులూ ప్రవేశిస్తారు. ఇక జాతికి ఆ ఉజ్జీవనం కలిగినప్పుడు, అది కొత్తగా మేలుకొన్నప్పుడు దానికి బాల్యదశవంటిదో, ప్రాయ ప్రవేశ దశ వంటిదో వచ్చిందన్నమాట. అప్పుడు భావన రేగుతూ ఉంటుంది. కల్పనావేశం జోరుగా ఉంటుంది. లోపల ఒక అద్భుత రసం నిండి ఉంటుంది. ఏ వస్తువు కనబడినా, ఏ అనుభవం ఎదురైనా - అది అద్భుతంగా ఉంటుంది. ఈ కాల్పనికోద్యమం (Romantic Movement) అద్భుత రసంతో నిండిన ఉజ్జీవనమే (Renaissance of Wonder) అని ఒక సాహిత్య తత్త్వవేత్త అంటాడు. అప్పుడు నాలుగు వైపులా మనల్ని పొదిగి ఉన్న జీవజగత్తులో పలుకరించని పదార్థం ఉండదు, పలికించని అనుభూతి ఉండదు; కవిని మరీని ; మహాకవిని మరీ గొప్పగాను.

అందువల్లనే వీరి కావ్య విషయాల్లో చాలా వైవిధ్యం ఉంది. ప్రకృతిప్రబంధకర్త మొదలుకుని పంజరకీరము వరకూ, అక్షర గీతము మొదలుకుని మక్షికము వరకూ, నక్షత్రము మొదలుకుని నక్కదోస వరకూ వీరికి కావ్య వస్తువులే. వీరి కల్పనా జగత్తు సువిశాల మైంది.

దేనిని వర్ణించినా వీరు నిసర్గ మైన "వర మనోహర పంచమ స్వరము" లోనే. వీరికి హాయి కలిగించే బాణీ ఒక టుంది. వేణు నాదం వంటిది. అది వీరి ఒక్కరిదే. ప్రతికవికీ తన ప్రత్యేకధ్వని ఉండాలి ; లేకపోతే ప్రతిధ్వని అవుతాడు. "కంఠస్వరాలు కొద్దిగానే ఉంటాయి ; ప్రతిధ్వనులు అనేకం" (There are few voices but many echoes) అని కవులని గూర్చి జర్మన్ కవి చక్రవర్తి అంటాడు.

ఈ సంపుటాల్లో వీరి పద్యకావ్యాలు అన్నీ ఉన్నాయి - 'బృందా వనము', 'ఏకాంతసేవ' తప్ప. 'ఏకాంతసేవ' దగ్గరకు వచ్చేసరికి వీ రొక అధిత్యక నధిరోహించి ఉంటారు.

వేంకట పార్వతీశ్వర కవు లిప్పుడు శ్రీమద్రామాయణమును ఆంధ్రీకరిస్తున్నారు. మన కందరకూ అదృశ్యులై ఉన్న ఆదికవిని భావనా బలంవల్ల ప్రత్యక్షం చేసుకుని, అతని అనుమతిని పొంది, కుశలవుల్లాగే ఆ దివ్యగాథను ఆలాపిస్తా రనుకుంటాను. "ప్రౌఢ నిర్భర వయః పరి పాకంలో" వీరు ప్రారంభించిన మహాకావ్య నిర్మాణానికి అత్యవసరమైన తపస్సు భక్తులైన ఈ మహాకవులు చేస్తూనే ఉంటారు. పిఠాపురం దక్షిణకాశి. అరుణోదయం కాకమునుపే పాదగయలో అఘమర్షణ స్నానం చేసి, శ్రీకుక్కుటేశ్వర మహాప్రభువు పాదసేవ చేసుకుని, ఆలయ మండపంలో ఆసీనులై ఉండిన్నీ, సాయంసమయాన పుష్కరిణీజలంలో ధౌతకల్మషులై, శ్రీ కుంతీమాధవ స్వామివారి చరణధూళి శిరస్సులపై ఉంచుకుని, కోవెలతోటలో కూర్చుండిన్నీ, భాగ్యశాలురూ, ప్రతిభావంతులూ అయిన వేంకట పార్వతీశ్వర కవులు శ్రీమద్రామాయణమును ఆంధ్ర లోకానికి అందిస్తా రనుకుంటాను.

('కావ్యకుసుమావళి' ద్వితీయముద్రణ నుండి-
శాస్త్రిగారి సవరింపులతో)

# బసవరాజు అప్పారావు మధుర స్మృతి

['బసవరాజు అప్పారావు గీతాలు' పునర్ముద్రణ (1955) నుండి]

"ఈ ప్రవాస యాత్రారతి ఇటులె నేను
గదలిపోవుదు నాశావకాశములను,
ఒక్క నిట్టూర్పు పోలిక, ఒక్క మౌన
బాష్పకణ మటు, ఒక గాఢ వాంఛ పగిది."

కొన్ని స్మృతులు మంచులో కొండలలాగ కలిసిపోయి కంటికి దొరకవు. కొన్ని స్ఫుటంగా నిలిచి కనబడుతూనే ఉంటాయి - వెనుక నున్న ఆకాశం మీద చిత్రింపబడ్డ తోపుల్లాగ. మరికొన్ని గాఢంగా స్ఫురిస్తూనూ ఉంటాయి. స్థూలంగా దొరకనూ దొరకవు, వేసవి వేకువలో గాలి తరగలాగ, ఆగాలి తరగపైన కలిగొట్టు పూల వాసన లాగ.

అప్పారావుకు సంబంధించిన స్మృతులు మూడవ రకానివి.

ఎంతకూ చల్లారని కోరిక లాగ కనబడతాడు నా కెప్పుడూ అప్పారావు - ఊరికే నిట్టూరుస్తూ ఉండే గుండెలాగ.

అతన్ని తలుచుకుంటే ఒకటి రెండు స్పష్ట సంఘటనలు గోచరించినా, ఎక్కువగా స్ఫురించేవి ఏవో ఆవేశాలూ, అలజడులూను. నలుగురమూ కలిసి కూర్చుని మాట్లాడుకునేటప్పుడు కూడా, ఒక్క నిముషము ఒక్క చోటనే కూర్చోలేక పోయేవాడు. అక్కడి నుండి ఇక్కడికీ, ఇక్కడి నుండి అక్కడికీ పచారు చేస్తూనూ, అంతసేపూ మాటాడుతూనూ, అప్పుడప్పుడు పాడుతూనూ, అడపా దడపా త్రుంచి త్రుంచి నవ్వుతూను.

దాదాపు నలభై ఏళ్ళ క్రితం నాకూ బసవరాజుకూ నెయ్యమేర్పడింది, యెంకి పాటల కవిద్వారా. సుబ్బారావూ నేనూ కాలేజీలో చదువుకునే వాళ్ళం. అప్పుడు అద్భుతరసంతో నిండిన మా మనస్సులకు అపరిచితమైన అమరలోకంలో నుండి అవతరించిన వాడు లాగ కనపడేవాడు అప్పారావు.

ఏమి రోజు లవి! అప్పటి మామనస్సులు ఎప్పుడూ రెక్క ముడుచుకోవడం లేదు. అప్పుడు మాకు గూడు లేర్పడలేదు. ఒకరి రెక్క అంచు మరొకరి రెక్క అంచుకు తగులుతూ ఉంటే, ఎగురుకుంటూ పోవడమే! నేలా, ధూళీ పిలుస్తుంటే మాకు వినబడేది కాదు. అంతేనా! ఒకరి గుండె మరొకరి గుండెలోనికి ఒలక బోసుకునే వారము, ఆలపాల కడవల్లాగ.

అప్పటికి గడసరితనం వచ్చి కాలుష్యమూ, కీర్తి కామమూ మమ్మల్ని మనుష్యుల్ని చేయలేదు.

అప్పటికే బసవరాజు కవితాంగణంలోనికి అడుగు పెట్టేసేడు. మే మిద్దరమూ - అంటే నండూరీ నేనూ, అప్పుడప్పుడు లోపలికి తలలు పోనిచ్చి తొంగి చూస్తుండే వారము.

మరి నాలుగేళ్ళయాక మరీ గొప్పరోజులు వచ్చాయి, తిరునాళ్ళ వంటివి. కాకినాడలో ఒక పదిమంది సాహితీపరులం చేరాము;

ఒకటే కావ్యగోష్ఠి. పగలల్లా ఇంట్లోనూ; సాయంకాలమూ ముని మాపూ కొంతరాత్రీ ఊరివెలుపల ఇసుకబయలు మీాదా.

ఒకరికి "గుండె గొంతుకలోన కొ"ట్లాడింది. ఒక "రాకులో ఆ" కయారు. ఒకరు చందమామను "పట్టి ము" ద్దాడారు. ఒకరు "శిథిల వీణను నాపై త్రోయక నీవే పాడుకొ" మ్మన్నారు.

బసవరాజు ఆ గోష్ఠికి ప్రాణం. ఊరికే మాట్లాడేవాడు, Wordsworth అనీ, Watts - Dunton అనీ, పండితరాయ లనీ, భవభూతి అనీ, తిక్కన్న అనీ, పోతన్న అనీ! ఊరికే పాడేవాడు— గురజాడవారి ముత్యాల సరాలూ, తన సెలయేటి గానములోని పద్యాలూనూ.

వాటిలో ఈ పంక్తులు నాకు బాగా జ్ఞాపకం; అప్పుడు గుండెకు రగులుకొని కుతకుత మరిగేవి:

"ప్రేమకుం గల్గు కారణం బే మనగల?
మింతిరో నిన్ను జూడ ప్రేమించుటె సుమి!
ఇంతియేగాని వేర్వేర నెంచి చూచి
అందపుం దళ్కులనె ప్రేమ నందగలమె?
తెలియు మాత్మను ఆత్మను కలిపి కుట్టు
దారమే నాదు ప్రేమకు కారణ మని"

అప్పారావు అలా పాడుతుండగానే అందుకునేవాడు సుబ్బా రావు; రివ్వుమని తారాజువ్వలాగ గొంతు విసిరేవాడు.

ఆ రోజుల్లో నండూరి గొంతు కొండవాగు. గలగలలూ గంతులూ, సుడులూ వడులూ - ఒక చోట పుట్టి, ఒక దారిని సాగి ప్రవహించి, ఒక చోట కలిసిపోయేది.

సుబ్బారావు పాట నిభృత సుందరం; అప్పారావు పాట నిసర్గ మనోహరం.

బసవరాజు పాటలో శక్తి వేరు. చెప్పాను కదా - అతను నిట్టూర్పు: అతని కావ్యం నిట్టూర్పు; అతని పాట కూడా వేడి వేడి నిట్టూర్పు.

కంఠం త్రుంపి త్రుంపి నాలుగుసార్లు ప్రయోగించేవాడు తునకలు తునకలుగా. అది మమ్మల్ని పిలిచి పిలిచి, దగ్గరగా వచ్చి వచ్చి, మా గుండెలోనికి ఒదిగి ఒదిగి, తల నక్క డ అనించి ఒక్కొక్కప్పుడు కుమిలి కుమిలి, ఒక్కొక్కప్పుడు వెక్కి వెక్కి ఏడుస్తూ, కష్టసుఖాలు చెప్పుకునేది. అతని పాటకు నెత్తురుజీర అంటుకున్నట్లుండేది, బ్రతుకులో నుంచి బ్రద్దలు చేసుకుని ఒరుసుకుని వచ్చినప్పుడు అంటుకున్నట్లు.

ఆ వేగమే, వేదనే అతని కవిత్వానికి ప్రాణం.

కాస్త గాలి కదిలితే, తగిలితే, ఒక్కొక్క ఆకే కదిలి, అన్ని ఆకులూ కలిసి, అంతా నిలువునా ఒకపాట యైన రావి చెట్టులాగ ఉండేవాడు బసవరాజు.

అందుకనే ముప్పయితొమ్మి దేళ్ళలో నూరేళ్ళ బ్రతుకు అతనికి క్రిక్కిరిసి పోయింది. సుఖాలూ, దుఃఖాలూ, రాగద్వేషాలూ, ఆలింగనాలూ, అసూయలూ, శిఖరాలూ, అగాధాలూనూ. ఇంత అనుభూతి వస్తే, ఇంత చిరుగీతి! -

"ఇంత చిరుగీతి యెద వేగిరించు నేని
పాడుకొనును, తాండవ నృత్య మాడుకొనును"

అతను కవిత్వాన్నే బ్రతికా డంటారు కవిమిత్రులు కొందరు, అతని కావ్యాలలో కన్న అతని జీవితం లోనే కవిత్వం ఎక్కువ

దొరుకుతుం దని మరికొంద రంటారు.

అలాగనడం కన్న అతని కావ్యాలూ, అతని జీవితం ఒకటే నంటాను నేను.

'సెలయేటి గానం', 'గీతాలు' - అతని రచన లన్నీ కలిసి అతని జీవితగాథ అయింది.

ఇంక అతనికి అనుభూతి రావడ మేమిటి, పాటలోనో పద్యం లోనో అనెయ్యడ మేమిటి! అందుకే అతని గీతాలలో అంత వేడి. పాటలో పల్లవి వచ్చేసరికే గుండె పట్టుకుంటుంది. వినేవాడి చేయి గట్టిగా పట్టుకుని ఎదురుగా కూర్చుండబెట్టుకుని "నీవే, నీవే నా స్నేహితుడవు గనుక, మన మిద్దరమే ఉన్నాము గనుక, చెపుతున్నాను సుమీ!" అన్నట్లు ఉంటుంది.

"న న్నెవ్వ రాపలే రీ వేళ
నా ధాటి కోపలే రీ వేళ"

అని మొదలుపెట్టి,

"గుండు తాతా మంటు కొట్టి నట్టుగ నేటి
పండితులు తా రెత్తి పరుగుచ్చుకోవాలి"

అని అనడానికి సందేహించడు. తన మనసులోని దంతా ఆప్తుడితో చెపుతున్నాడు గదా! అతనికి లోకమంతా ఆప్తమిత్రమే కదా!

అలాగే ఏ గీతం తీసుకున్నానూ - వేడిగా అనెయ్యడమూ, సూటిగా అనెయ్యడమూ, ఏమీ దాచకుండా అనెయ్యడమూను! ప్రేమ గీతాలు, భక్తికీర్తనలు, కన్న బిడ్డలపై పాటలు- అన్నీ అంతే:

"మంచిరోజు కాదోయి చందమామా!
మంచిదారి కాదోయి చందమామా!"

"పాడదలచిన పాటలన్నీ వా నోట
పాడించ మనసాయె నయ్యా!"

"మండి పోతున్న వండోయ్, లోకాలు
మంట లార్పియ్యంగ రండోయ్"

"ఎంతటి చపలుండ నైతి,
ఎంతటి మందమతి నైతి"

"కోయిలా కోయిలా కూయబోకే!
గుండెలూ బ్రద్దలూ చేయబోకే!"

"లోకాని కుత్తుత్త దీపావళీ!
వాకు మాత్రము దివ్య దీపావళీ!"

"లేపనైవా లేపలేదే, మోము
చూపనైవా చూపలేదే!"

ఈ గుణం వల్లనే, ఈ అప్యాయత వల్లనే, ఇతని గీతాలు సామాన్య ప్రజకు కూడ అంత చనవై పోయాయి; దిన దిన జీవితానకు, చలనచిత్ర లోకానకు అంత అవసరమై పోయాయి.

బసవరాజు మొట్టమొదటి భావకవి; అంటే భావకవిత్వానికి త్రోవ చూపిన వాడనే కాదు; తరువాత వచ్చిన భావకావ్య జగత్తుకు ప్రవేశిక వంటివాడు - "ముందు ఇతని గీతా నిశ్రేణి ఎక్కు. తరువాత భావకావ్య లోకంలో పరిచితంగా విహరించవచ్చు" నన్నట్టు.

అయితే, అంత తొందరలో, అంత వేడిమిలో పీల్చుకు వచ్చిన పాటను, అంత నగ్నంగానూ, అలాగే, సరిగ్గా అలాగే,

ఇవతలికి విసరివేసి నప్పుడు కల్పనకు అవకాశ ముండదు; శిల్పానికి స్తిమిత ముండదు.

అనుభూతిని నిదానంగా నెమరు వేసుకుని - recollection in tranquillity లో లాగ - అతను కావ్యం కట్టడు. అనుభూతి రావడమూ, అనెయ్యడమూ ఒక్కమాటే జరుగుతాయి.

మరొక విశేషం. పాడుతూ వ్రాసే వాడేమో బసవరాజు. అయితే కొంతవరకు అందరూ అలాగే వ్రాస్తారేమో; కాని అతని పాట అంతర్వాహిని కాదు; కేవలమూ అడుగున శ్రుతి కాదు. పాటదే పైచెయ్యి. దాని బలం ఎక్కువైపోయే దేమో కూడా. మరి అతనికి కావలసింది, "Relief which a timely utterance gives." అందువల్ల భావనా శిల్పాలు లేని వెలితిని పాట భర్తీ చేసేది. అందుకనే అతని రచనలు కొన్ని కావ్యాల లాగ కూర్చుని చదివేవి కావు; గొంతెత్తి పాడేవి. అందుకనే గూడా పాడేటప్పుడు అతని గీతాలకు ఉన్న శక్తి మరి ఏ కవి గీతాలకూ లే దనిపిస్తుంది.

అందుకనే గూడా అత నెప్పుడో గాని మామూలు శబ్దాలను దాటి వెళ్ళలేదు. ఎవరితోనైనా కష్టసుఖాలు వేగముతో వేదనతో చెప్పుకునే టప్పుడు అపూర్వ శబ్దాలకూ, అల్లిక జిగిబిగికీ పరుగెత్తుతామా?

అతను రోజు రోజూ నిముష నిముషమూ అలాగే చెప్పుకునే వా డాయెను. అతనికి కవిత్వమూ, చెప్పుకోవడమూ ఒక్కటే ఆయెను.

ఈ గుణం వల్లనే అతను గురజాడ వారికి అనుచరుడు అయాడు; కొన్ని కొన్ని చోట్ల అంతకన్న అధికు డయాడు. గురజాడవారిలో

ఈ ఆప్తత, ఈ ఆర్ద్రత ఇంతగా లేవు. Wordsworth "సామాన్య బాషలో కవిత్వం చెప్పా" లని ఒక మతంగా అవలంబించి చేయాలని చేసిన పని ఇత నింకొకలాగ చేయలేక చేసి ఊరుకున్నాడు. ఊరుకున్నాడా? పది మందీ పరవశులై వినేటట్లు ఆలపించాడు.

దీని వల్ల ఒక్కొక్కప్పుడు Wordsworthలో లాగే పేలవమైన మాటలూ, కాళ్ళు బాపేసి చతికిలబడే పంక్తులూ రావచ్చు. అయినా జీవద్భాషకు, వ్యావహారిక భాషకు ఇంత దగ్గరగా కావ్య భాషను తీసుకువచ్చే ప్రయత్నం గొప్పపని కాదూ?

కవి విధుర జీవితంలో - ఆ మబ్బు ఈ మబ్బు ఆకాశమధ్యాన అద్దుకొన్నప్పుడు చిట్టి తల్లి - బంగారపు బొమ్మ - మంగళప్రదమ్మ అవతరించింది.

అంతలో ఇతన్ని దేవుడు 'కత్తిపెట్టి పొడిచాడు. గాయం ఇంకా మానలేదు.'

మంగళప్రద (కవి చిన్నపాప) మాయ మయింది. "మరవలేదే నిన్ను మా కన్న తల్లి!" అని ఏడ్చాడు. "కోయిలొక సారొచ్చి కూసి పోయింది" అని పలవించాడు.

ఇంతలో దీపావళి వచ్చింది.

మన కందరికీ లాగ ఉత్తుత్త దీపావళి కాదు. దివ్య దీపావళి! వేదాద్రి నరసింహ దేవు డతని ఇంట దీప మైనాడు. పరమాత్ముడు వేంచేసి పటమట లంకలో ఉయ్యాల తొట్టిలో ఊగుతున్నాడు.

కవి అమాయకుడూ, ఆశాజీవీని. పాపాయి రాకతో మళ్ళీ బ్రతుకు నందన మైపోయింది.

ఇంతలో -

"వేదాద్రి శిఖరాన వెలిగిన్న జ్యోతి
మినుకు మని కాసేపు కునికి పోయింది;
దేవలోకము నుంచి దిగివట్టె గంగ
వచ్చిన్న దారినే పట్టి మళ్లింది;
పంజరం దూరిన బంగారు పిట్ట
తలుపు తీ సేవేపా తర్లిపోయింది;
కాపుర మ్మొచ్చిన కన్ని పాపాయి
ఇల్లు ఖాళీ చేసి వెళ్లి పోయాడు!"

ఈ గీతం మా బసవరాజు పాట లన్నింటికీ కిరీటం. తుది పంక్తి ఈ పాటకు తురాయి.

"ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు."

ఎటువంటి మామూలు మాటలు! నిజానికి ఎంత పేలవమైన మాటలు!

ఇక్కడ మాత్రం మాట మనిషై ఎలాగ గుండెల్లో పొడిచింది! రోజూ ఎన్ని ఇళ్ళో ఎందరో ఖాళీ చేసి వెళ్ళిపోతున్నారు; మరి కొందరు ఆ ఇళ్ళల్లోకి వస్తున్నారు. ఖాళీ చేసినా ఖాళీగాని ఇళ్ళు అవి.

ఈ ఇల్లు వేరు. ఈ ఇల్లు కిటికీ, తలుపులూ లేని అమాయకపు ఇల్లు. ఈ ఇల్లు ఒక్కొక్కరే ఖాళీచేసి వెళ్ళిపోయేదే గాని తిరిగి రాని ఇల్లు. కొన్ని ఇళ్ళు బావురుమని ఏడుస్తాయి; ఫరవాలేదు. అబ్బ! ఈ ఇల్లుశూన్యం - దీన్ని పాపాయి ఖాళీ చేశాడు గనక.

ప్రపంచ కావ్య భాండారంలో గొప్పపంక్తుల్లో ఇదొకటి - 'ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు!'

అప్పారావు కవిత్వం వల్ల ఏమి ప్రయోజనం అంటే ఏమి చెప్పను? అతని కావ్యా లన్నీ చదివాక నిట్టూర్పు విడువకుండా, కన్నీటితో చెక్కులు తడియకుండా ఉండ లేము.

ఆ కన్నీటి కెంతటి శక్తి ఉంది? ధూళీ దూగరా లేకుండా, శుభ్రంగా, శాంతంగా, సుందరంగా, వాన వెలిసిన తరువాత చెట్టులాగ, చల్లని ఆవేశంతో రవంత ఊగుతూ నిలబడతాము.

అప్పారావుకు సంస్కృత సాహిత్య మన్నా, పురాణ భారత సంస్కార మన్నా వల్లమాలిన గౌరవమూ, అనురాగమూనూ. ఆంధ్ర దేశ మన్నా అంతే! వాయు పక్షాల మీద తెలుగునా డంతా తిరిగి సందేశ మిచ్చినవాడు. భారత స్వాతంత్ర్యం కోసం పాటు పడిన వాడు. కొల్లాయి కట్టుకున్న బోసినోటి వానికి దాసుడైన వాడు.

అయితే అతని దేశభక్తి సంకుచిత మైనది కాదు. అతను యుగ లక్షణాలకూ, యుగ ధర్మాలకూ దూరుడు కాలేదు. రాగల యుగం ప్రజాబాహుళ్యాని దని తెలుసుకున్నాడు. ప్రాచ్య పాశ్చాత్య జగత్తులకు నడుమ కొండలూ, గోడలూ లేవని తెలుసుకున్నాడు. ఆంధ్ర కవిత్వ చరిత్రలో అతను వ్రాసిన తుది పంక్తు లివి :

"ప్రస్తుత మాంధ్ర సాహితీ శ్రేయోభిలాషులకు ముఖ్యకర్తవ్య మే మన : తరతరముల నుండియు, శత శతాబ్దుల నుండియు నిరంతర ధారగా ప్రవహించుచున్న ఆంధ్ర నాగరకతా స్రవంతిని ఆంధ్ర సాహిత్య సీమను ప్రవహింపజేసి తత్ప్రవాహ సాహాయ్యమున ఆంధ్ర సాహిత్య సీమను చక్కని వ్యవసాయము సాగించి, ఆంధ్రులకు పుష్టియు, తుష్టియు, శాంతియు, దాంతియు, వన్నెయు, వాసియు నిచ్చు కావ్య ఫలముల కాయించుటయే యగును. ఆంధ్ర సాహిత్య

సీమను నాటుకుని, పెరిగి పెద్దవి కాగల విజాతీయ కావ్య తరు లతాదుల నాటించి, వానిచే సజాతీయ, విజాతీయ సారసమృద్ధములగు కావ్య ఫలముల కాయించుటయును మేలగును. ఇందులకు అన్యభాషా సంస్కారమును, అన్య సాహిత్య పరిచయమును అవసరములై యగును.''

అప్పారావుది సమగ్ర సుందరమైన గొప్ప సంస్కృతి ; దువ్వూరి రామిరెడ్డి గూడా ఇట్టివాడే!

1929 లోనో, 1930 లోనో నేను మదరాసునుండి పిఠాపురం వస్తున్నాను. పేసింజరు తెల్లవారగట్ల కొవ్వూరు దాటి గోదావరి మీద పోతూంది. నాకు మెలకువ కాదు, నిద్దుర కాదు. వంతెన మీద నడిచే ట్రెయిను హోరులో కలిసి పక్క కంపార్టుమెంటు లోనుంచి ఒకపాట వినబడింది.

"ఈ మహా గహనాంతర సీమ లోన
నీవు శ్రీగిరి భ్రమరాంబ నేను మల్లి
కార్జునుడ...."

ఆ పాట పాడిన వారు ఎవరు? మా బసవరాజా?

గోదావరి స్టేషనులో దిగి పక్క కంపార్టుమెంటులో తిలకించగా అతనూ, అతని అర్ధాంగి రాజ్యలక్ష్మమ్మా - కవయిత్రి సౌదామనీదేవి - కూర్చుని ఉన్నారు.

''ఎక్కడికి వెడుతున్నా?'' రన్నాను. ''ఉత్తర దేశ యాత్రకు'' అన్నాడు.

అతని దెప్పుడూ మజిలీ లేని యాత్రే ఆయెను! అతని తత్త్వాన్ని బట్టి అతన్ని 'gypsy' అనేవాళ్ళం.

ఒక పాట పాడ మన్నాను.

"బ్రతుకు బరువు మోయలేక
చితికి చివికి డస్సి వాడి
పికరు పుట్టి పారిపోయి
ఒకడనె ఏ తోటలోనా

పాట పాడు తుండగ నా ప్రాణి దాటి యేగేవా ?
ప్రాణి దాటి యేగుచుండ పాట నోట మ్రోగేవా ?"

తరువాత మరి అతన్ని చూడలేదు.

పాటపాడుతూ పోయాడు మా బసవరాజు. పోతూ పాట పాడాడు.

రాగ ద్వేషాలు దాటి శ్రీ శైల మల్లికార్జున స్వామి చరణ సవిధాన చివరకు మజిలీ దొరికింది. తానూ, మంగళప్రదమ్మా, పాపాయీ ఉన్నారు అక్కడ.

ఇక్కడ అతని ప్రాణానికి ప్రాణమైన రాజ్యలక్ష్మమ్మా, ప్రాణ మిత్రుల మైన నండూరీ, నేనూ ఉన్నాము.

—"బసవరాజు అప్పారావు గీతాలు" పునర్ముద్రణ (1955) పీఠిక

# మల్లవరపు విశ్వేశ్వరరావు 'మధుకీల'

[ 'మధుకీల'కు - 1937 - 'ప్రహరవ' పరిచయ వాక్యాలు ]

౧

"విశ్వేశ్వరరావూ! నీ పద్యా లన్నీ కలిపి ఒక పుస్తకంగా తయారు చేయాలయ్యా!" అని నేను నాలు గైదేళ్ళ క్రితమే ఇతన్ని హెచ్చరించాను. నేను పద్యాలు వ్రాసే వాళ్ళందర్నీ అలా అడగను.

విశ్వేశ్వరరావు నిజంగా కవి.

అసలు ఇతనికి కవిత్వం రాయడం తప్ప ఇంకేమీ రాదని నా నమ్మకం. నాకూ అంతే! మరేదైనా పనిలో లోక మంతా కట్టుకట్టి మమ్మల్ని పడేస్తే ఆ పనీ పాడవుతుంది; మా కవిత్వమూ పాకు లాడుతుంది. దైవానుగ్రహం వల్ల విశ్వేశ్వరరావు దేనిలోనూ చిక్కు పడక ఇంతవరకూ కొట్టుకొచ్చాడు. లోకం మాత్రం విశ్వేశ్వరరావు ఇంకా స్థిరపడలే దంటుందేమో!

కవు లనబడేవాళ్ళు రెండు రకా లున్నారు. 'నీల్ కాల్' సిరాలో కలం ముంచి వ్రాసేవా ళ్లొకరూ; నీలాకాశం వెనకాలకి నిశిత

దృక్కులు గుచ్చి వ్రాసేవా ళ్లొకరూ. రెండోరకం వాళ్లు అసలైన వాళ్లు ; అసాధ్యులు.

ఇతను రెండోరకం వాడు.



మొట్టమొదట కవికి నారదుని 'మూంస లాంసమున జొనిపిన మహతి' లాంటి హృదయ ముండాలి – ప్రతీ గాలి వ్రేళ్ల నొక్కులకీ అలా అలా చలించుకునిపోయే తీగలూ అదీని. అలాంటి గుండె ఉంటే, జీవితంలో ఏ మంచి అనుభవం వచ్చినా కవి తన్మయుడై పోతాడు. ఉదాత్తమైన 'భావోద్వృత్తి' (తన్మయత్వము, emotion) కలుగుతుంది.

ఆ అంతర్వేగం ఉన్నవాడికే నీలాకాశం వెనకాలికి - అంటే 'పెనుచీకటి కవ్వలి'కి - చూడగలిగే భావన కూడా (imagination) ఉంటేనా ! ఈవరం చాలా చాలా కొద్దిమంది కుంటుంది. కవు లన బడేవాళ్ళ కెందరికో నిజానికీ శక్తి ఉండదు. ఇదే కవిని స్వతంత్రుణ్ణి చేసి, ప్రత్యేక వ్యక్తిత్వ మంటూంటారే దాన్నిస్తుంది.

వీటికి తోడు గుండెల్లో లోపల్లోపల సంగీత మున్న వాడైతే, చెప్పదలచుకున్న వాటికి సరిగ్గా సరిపోయేటట్టూ, పాతమాటలు కొత్త అర్థం స్ఫురించేటట్టూ కలుస్తాయి ; కొత్త మాటలు కూడా వస్తాయి. కొత్త కొత్త నడకల ఛందస్సులు వచ్చేస్తూంటాయి ; ఎంత పాత పాత ఛందస్సులైనా కొత్త కొత్త పరుగు లెత్తుతూంటాయి.

ఈ మూడు శక్తులూ ఉన్నవాడు కవి.

విశ్వేశ్వరరావు కవి.

3

విశ్వేశ్వరరావు మంచి అదృష్టవంతుడు. నేటి తెనుగు కవులలో ఎంతో మందికి దొరకని సంపర్కాలు (influences) కూడా కొన్ని ఇతని జీవితంలో ప్రవేశించాయి.

దాదాపు నూరేళ్లూ ఈ మధ్య మొదట వంగ దేశాన్నీ,నెమ్మదిగా భారతదేశాన్నీ కనబడేటట్టో, కనబడకుండానో అన్ని విధాలా మార్చింది బ్రాహ్మసమాజ మని నా గట్టి నమ్మకం. జాతికి మహాశయాల్నిచ్చింది ; రెక్కలు తొడిగింది. ఇక కళాలోకానికా ? ఠాకూరుల్నిచ్చింది. ఆంధ్రదేశంలో కూడా బ్రాహ్మసమాజం గొప్పపని చేసి తీరింది. దీని ప్రభావంలో విశ్వేశ్వరరావు చిన్నతనంలోనే పడ్డాడు.

తరువాత విశ్వభారతిలో గురుకుల వాసం! రవీంద్రుని సాన్నిధ్యంలో 'విశ్వం' చాలా వికసించాడు. దూర దూరాల నున్న మాలాంటి వాళ్ళ నెందర్నో అతి విచిత్రంగా మార్చి అనుచరులనుగా చేసుకున్న ఆ గురుదేవుని శాంతి నికేతనంలో ప్రవేశించి, మహర్షులాసీనులైన వృక్షచ్ఛాయల్లోనూ, కళాభవనాల్లోనూ, నాట్య గృహాల్లోనూ తిరుగుతూ, వర్తమాన భారతంలో భారతీదేవికి ఏకైక నివాసమైన 'ఉత్తరాయణం' వైపు పదే పదే ఊరికే చూస్తూనైనా అయిదేళ్ళు ఆనందంగా ఇత నుండగలిగాడు.

ఇంటికి తిరిగి వచ్చాడు. వసంతం మీదా, వానచినుకు మీదా కులాసాగా పద్యాలు ఆలపించాడు. నేను విన్నా నా రోజుల్లో. 'గడ్డి పువ్వని' అన్నాడు. 'తెప్పవోలిక చంద్రబింబం తేలిపోతో వుంది' అన్నాడు. "అన్నా ! ఇతని మాటకీ పాటకీ లోతూ, వేడీ, గడుసుతనం ఇచ్చే సంఘటనలూ, అనుభవాలూ కూడా ఏవైనా ఇతని బ్రతుకులో వచ్చిపడితే బాగుండునే!" అనుకున్నాను. ఇంతలో

ఓనాడు వచ్చి 'ఏ రేయి చీకట్లు నీ చేయి తుడుచునో . . . . . నా వాడువారు గుండెలలోని పూగుత్తి' అన్నాడు.

మధుకీల తయారైంది.

౩

నా కిష్టమైన కొన్ని కావ్యాలు:

'ఆవాహన' సుప్త మధుకీల లాగ లోపల లోపల అంటుకుంటూ పరుగెత్తింది.

'నిశాలోచన' లో 'నిదురలో వెన్నెలలు నిశ్వసించాయి' అన్నప్పుడు నా కెందుకో అవి నిద్రలో పక్కకి ఒత్తిగిల్లినట్లూ, పలవరించినట్లూ కూడా అనిపిస్తుంది.

"వేయి తారల మిన్క
లూ, తళ్కులూ
. . . . . . . . .
నీ కళ్ళ లోతులం
దో కోమలీ! తూగు
తూ, ఊగుతూ, పాడు
తూ నాట్య మాడేవి!"

ఈ ప్రేమగానము మరీ తూగుతూ, ఊగుతూ,

'అరవిచ్చి వసివాడు
సుమ మౌదునో?
విరిగి వ్రాలిన లేత
ద్రుమ మౌదునో?'

అనేటప్పటికి ఎంతో అలసిపోయి, విరిగి, వాలి, మూర్ఛిల్లింది!

'నిశి కడుపులోన దీపిక లెవరు' నిలిపారో సూటిగా అడిగి, మరీ సూటిగా చెప్పాడు.

'పిపాస' చదివాక, కాలి కాలి బ్రద్దలైన ఓ పెద్దబయలూ, దాని మధ్య చేతులు చాపి ఓ తుమ్మచెట్టూ జ్ఞాపకం వచ్చి జాలీ, భయమూ వేస్తాయి.

'విస్మృతి'

'తన కన్నులు
వికసించుక
మనల పిల్చు'.

ఒక తారక! - ఈ గేయం అంటే నాకూ చాలా యిష్టం!

'ఏ నాడు' అంటే అన్నింటి కన్న.

'ఉజ్జీవనము' లో ఈ రెండూ నాకూ తెలుసు-'ఒక్క తారక నింగి నొదిగి నర్తించడం', 'వాడిన విరహమ్ము వాడియై మరల ఆగిన అన్వేషణార్థమ్ము' రేపడం!

'సింగారం' ఒక్క పులక!

'విరహ విజయము'లో -

'మినుకు మినుకు మని వెదకును వేగు రిక్క
విల విల చలియించును దిగిపోవు చుక్క -
వెండి మొయిలు మైదానమె
రెండిటి దూరము సేయును' -

గొప్ప పంక్తులు!

నాకు బాగున్న వన్నీ ఎలాగ చూపించడం?

౨

విశ్వేశ్వరరావుకి నేనూ, నా కావ్యాలూ అంటే చిన్నప్పట్నుంచీ చాలా ఇష్ట మనుకుంటూ. నాకు అతనూ, అతని కావ్యాలూ అంటే ఎంతో ఇష్టం. అభిరుచులూ, ఆశయాలూ - ఇలాంటి వన్నీ చాలా వరకు ఒక మోస్తరువే!

అంతే కాదు.

నా బ్రతుకు మాత్రం మధు కీల కాదూ? అబ్బ!

# రవీంద్రుని కవితాశిల్పం

లిరిక్కును మనం గేయం అంటాం; రవీంద్రుడు గీతి అంటారు. ఈ యుగంలో రవీంద్రనాథ్ ఠాకూర్ అంత కవి మరొకడు లేడు. ఆయన గేయాలు విశ్వ సాహిత్యంలో ప్రప్రథమ శ్రేణికి చెందినవి.

ఠాకూర్ కవితలో కవిత్వం కాక మరేదో ఉంది అతని కవిత్వంలో లిరిసిజమ్ - అంటే గేయత్వాన్ని మించిన దేదో - ఉంది. అతని కవిత్వం అతని పెర్సొనాలిటీని - అంటే అతని ఆంతర మూర్తిని - వ్యక్త పరిచేదే కాక, దాన్ని అంత కంతకు సుందరంగా వికసింపజేసే సాధనం కూడా. అతడు ఋషి; అతని అనుభూతులు ఇహ పరాలకు నిచ్చెనలు. "అతని ప్రతి దిన సంభాషణమే శ్రోతల మనస్సులలో ఒక వింత కాంతి నింపేది" అని ఒక గొప్ప పండిత విమర్శకుడు రవీంద్రుని గురించి అన్నాడు.

అట్టి రవీంద్రుని మూర్తిని విశదపరచ బోవడం మేరువుకి మెట్లు కట్టడం లాంటిది. అతని కవిత్వాన్ని గూర్చి చెప్పబోవడం సముద్రానికి ఏతాం ఎత్తడం లాంటిది.

రవీంద్రులే ఒక చోట వ్రాసేరు - దాదాపు ఇలాగ : అన గనగా 'సత్యం' అనే రాచకొమార్తె ఉంది. ఆమెను చూడటానికి ముగ్గురు ప్రియులు వెడతారు. మొదటివాడు సైంటిస్టు. వీనికి పక్షపాతం లేదు. వీనికి రాచకూతు రయినా, బిచ్చగత్తె అయినా, అందగత్తె అయినా, అనాకారి అయినా ఒకటే! నిర్దిష్టమైన, ఒక స్పష్టమైన సిద్ధాంత దృష్టితో ఆమెను చూసి ఆమె గుణ గణాలను తెల్సు కుంటాడు. తరువాత, ఎకనమిస్ట్ - అర్థశాస్త్రవేత్త - వస్తాడు. ఇతడూ అలాగే! అంటే ఆమె దుబారా మనిషా లేక పొదుపరా అనే ధోరణిలో తేల్చుకుని పోతాడు. వీరిద్దరూ ఆమెను గూర్చి తెలుసుకో దలచుకున్నది స్పష్టం - అగ్నిని అంటితే కాలుతుంది అన్నట్లూ, నీరు పల్లానికి ప్రవహిస్తుంది అన్నట్లూ, రూపాయికి నూరు నయాపైస లన్నట్లూను. ఆమెను గూర్చి వారు తెలుసు కున్నది స్పష్టంగా చెప్పేస్తారు ; మామూలు భాష చాలు. వీరిద్దరి తరువాత మూడవవాడు వెడతాడు. వాడు సైన్సులోనూ, ఎకనమిక్సు లోనూ ఏ పరీక్షా పాసవలేదు. రవీంద్రు లంటారు వాణ్ణి గురించి : 'What he has passed is his 21st year and the unpassable heath of the fairy tales.' వీనికి ఆమెను చూడ గానే ఏదో అనురాగమో, ఆనందమో లోపల కలుగుతుంది. దానికి కారణం గూడా శాస్త్రజ్ఞుడి లాగా, అర్థశాస్త్రవేత్తలాగా స్పష్టంగా నిరూపించలేడు. వ్యక్తపరచడానికి లొంగని ఈ ఆనందాన్నో, దేన్నో వ్యక్తపరిచేవాడు కవి. ఎలాగ వ్యక్తపరచ డానికి ప్రయత్నిస్తాడూ - చెప్తా !

కళ లన్నిటిలోకీ - ఒక దృష్టితో చూస్తే - సంగీతం గొప్పది. మాన వానుభవాలలో ఇది అందుకోని ఎత్తులూ, లోతులూ లేవు. మాటకు లొంగని అనుభవాలనీ, ఆవేశాలనీ సంగీతం అందు కుంటుంది ; అందిస్తుంది. అందుకనే రుషులు ఛందములను గానం

చేసేరు. భక్తులు పాటల రెక్కలమీద పరమపదం అందుకున్నారు. సూక్ష్మమైనవీ, సుదూరమైనవీ ఒక ఋషియైన మహాకవి ఆత్మానుభూతులు వ్యక్త పరచడానికి శబ్దాలు సామాన్యరీతిలో ప్రయోగిస్తే చాలదు. వాటిని అవసరాన్ని బట్టి ఏరి, వేరదీసి, ఒక మూసలో పోసి, అక్కడ ఆ గానానికి ఉండే శక్తిని పొందించాలి. కవికి పర్యాయ పదాలు లేవు. ప్రతి పదానికీ ప్రత్యేకమైన రుచీ, రంగూ ఉన్నాయి. ఛందస్సులూ, గణాలూ ఒప్పుకున్నా, కవికి ఏదో ఒక్కటే తప్పకుండా ఉపయోగించి తీరవలసిన శబ్దం - ఒకే ఒకటి - ఉంటుంది. అలాగే అవసరాన్ని బట్టి ఎక్కడి కక్కడికి ఒకే ఒక ఛందస్సు ఉంటుంది. ఆ విధమైన కూర్పు లిరిక్ - గేయం - గీతి అవుతుంది.

తల్లికి బిడ్డమీద వల్లమాలిన ప్రేమ. అది ఎలాగ వ్యక్తపరుచుకుంటుంది? ఒకసారి జుట్టు జడలా అల్లీ, ఒకసారి ముడిగా కూర్చీ, ఇంకొకసారి పావడా తొడిగీ, మరొకసారి రైకా, కోకా కైసేసీ, తన అనురాగాన్ని అలంకారాల ద్వారా పైకి ఒలకబోసుకుంటుంది. కవి కూడా తన అనుభవావేశాలను శబ్దార్థాలంకారాల ద్వారా తెలియజేసుకుంటాడు. కవిత్వాన్ని గూర్చి ఇలా రాసుకుంటూ సాగుతారు రవీంద్రులు.

అయన్ను గూర్చి రాస్తూ లిరిక్కులో - గేయంలో - 'expression and the expressed are one' అంటాడొక బుద్ధిశాలి, ఒక పాశ్చాత్య సాహిత్య వేత్త. 'The music almost is the meaning' అన్నంత దాకా పోతాడు. అంటే ఆ లిరిక్ వినగానే, ముందుగానే ఆ శ్రోత ఒక మనస్థితిలో పడిపోతాడు. ఒక ఆవేశపు టంచు లతనికి తగులుతాయి. ఒక అనుభవం స్ఫురిస్తుంది. ఇలా అన్నప్పుడు దానికి అర్థం ఉండదని కానీ, అక్కరలేదని కానీ కాదు. మనస్సు విప్పి, దాన్ని పఠించగానే అగాధమైన అర్థ గాంభీర్యాన్ని గ్రహిస్తాడు శ్రోత.

ఈ గేయ రచనలో – అసలు కవిత్వం చెప్పడంలోనే - ఒక ఆపద ఉంది. దానికి చాలా మంది వశులైపోతారు. కావ్య వస్తువు లాగ కనబడేవి కొన్నింటిని ఏరుకోవడం, కవిత్వంలో నప్పేటట్లు తోచే తియ్యని, మెత్తని మాటలూ, సమాసాలూ ఏరడం, వాటిని కూర్చి తేలికగా గేయమో, ఖండకావ్యమో తయారు చేయడం వీళ్ళు చేసే పని. ఛెస్టర్టన్ అన్నట్లు ఇలాంటి కవిత్వపు ధోరణే ఒక వ్యాధి. ఛెస్టర్టన్ అంటాడూ : "The artistic temperament is a disease that afflicts amateurs. Its greatest tragedy is that it cannot produce any art."

ఇలాగే ఇంకొక చిక్కు వస్తూంటుంది కవికి. షెల్లీని గూర్చి ఫ్రాన్సిస్ థామ్సన్ రాస్తాడు. ఏమనీ ? "మనుష్యుల్లో లాగే మాట ల్లోనూ ఒక ఉదాత్త కావ్య జాతికి చెందిన శబ్దాలలోనే అంతర్వి వాహం చేస్తూ పోతూంటే నీరసమైన నాజూకు సంతానం పుట్టు కొస్తుంది. వంగడాన్ని ఉజ్జీవింప జేయడానికి సామాన్యజాతి రక్తాన్ని నాళాలలోనికి ఎక్కించ వలసి ఉంటుంది."

ఇక రవీంద్రుని సరస్వతి గంగా గోదావరుల లాగ జీవనది. అతని ఉదారవాణి నిత్యమూ ప్రాణశక్తితో ఉచ్ఛలితమై ఉండేది. అతని కావ్యలోకంలో వల్లమాలిన వైవిధ్యం ఉంది. కారణం ఇదీ: అతడు ఈశ్వరుని ఏకత్వంతోపాటు మానవుని ఏకత్వం, సమస్త ప్రాణుల ఏకత్వం గ్రహించి అనుభవించినవాడు. అతని కావ్య వస్తువులు అడు గడుగునా తగిలేవి. అతని మనసూ, హృదయమూ దశ దిశల మధ్య నున్న ఈ లోకంలో అలా ప్రయాణం చేస్తూనే ఉండేవి. అట్టి కవి అనుభూతులకు పాత కావ్యాలలోని శబ్దాలూ, కూర్పులూ, ఛందస్సులూ సరిపోలేదు. ఎలా సరిపోతాయి ? కను కనే, రవీంద్రుడు అంతులేని భాండారాన్ని అంది పుచ్చుకున్నాడు. అదేదీ ? నిత్యమూ జనం మాట్లాడే భాషా, జానపద గేయరీతీ.

రవీంద్రునికి ముందు భారత సంద్ర, మైకేల్ మధుసూదన్ దత్ వంటి కవులు మందాక్రాంతము, శిఖరిణి, మాలిని వంటి సంస్కృత చ్ఛందస్సులనూ, వైష్ణవ పదావళులనూ వాడుకున్నారు. రవీంద్రుడు వాటిని కొద్దిగా వాడినా అతని రచనల కవి సరిపోలేదు. వ్యావహారిక వంగ భాషలో దీర్ఘాచ్చులు తరచు కనబడవు. అంటే ఉచ్చరించరు. కనుక సంస్కృత చ్ఛందస్సులలో వ్యావహారిక వంగ భాష సాఫీగా ఇమడదు.

రవీంద్రుడు వాడుక భాషలో వ్రాసేవా డాయెను. బీహారీలాల్ చక్రవర్తి నుండిన్నీ, తన అన్నగారైన ద్విజేంద్రనాద్ నుండిన్నీ కొన్ని ఛందోరీతులను రవీంద్రుడు తీసుకున్నాడు. కాని, జానపద గేయ రీతులను పూర్తిగా తనవి చేసుకుని, వాటిలో చెప్పలేనన్ని రకాల ప్రయోగాలు చేసేడు. రవీంద్రుని గేయాలలో ఎన్ని రకాల ఛందస్సులూ, నడకలూ, పోకడలూ! అందంగా, సహజంగా ఉండే ఎన్ని రకాల అంత్యప్రాసలూ!

రవీంద్రుడు జానపద చ్ఛందస్సుల నెక్కువగా తీసుకొన్నాడే అనుకోండి. అందువల్ల, కవితకి రాచఠీవి ఏమీ తగ్గలేదు. ఆ రాచఠీవి ఆ ఛందోరీతులది కాకపోవచ్చు; వాటిలో పొదిగి ఉన్న ఉదాత్త భావాలదే!

'వ్యావహారిక భాషలోనే, అన్ని రకాల పద్యాలనూ అన్ని రకాల ఛందస్సులలోనూ వ్రాయవచ్చు. ఆ భాషలోని ప్రాణశక్తి-విలాయతీ పదాలను తనలో ఇముడ్చుకునే శక్తి - చాలా అమేయమైనది' అని గురుదేవులే అన్నా రొకచోట. అంతే కాక, ఇంగ్లీషులో ఫ్రీవెర్సు పద్ధతిని 'ముక్త చ్ఛందస్సు' అనే పేరుతో ఎన్నో గేయాలు వ్రాసి ఉన్నారు. వీనిలో లయ సంప్రదాయాలను అను

సరించినది కాదు; విచ్చల విడిగా వంపులు తిరిగే రాగంలో తిరుగుతూ సాగుతుంది.

రవీంద్రుడు గేయాలలో ఛందస్సు వినియోగించుకోవడంలో ఎన్ని విధాల ప్రత్యేకత చూపించాడు! ముఖ్యమైన వైచిత్రి ఒకటి ఉంది. 'మొనేరొ్బే కినారొ్బే ఆమారే' అని ఉందనుకోండి. ఈ పాదం సంస్కృతంలో గానీ, తెలుగులో గానీ చదివితే, దీర్ఘాలనూ హ్రస్వాలనూ ఎలా ఉన్నవి అలా ఉచ్చరిస్తాం - "మొనేరొ్బే కినారొ్బే ఆమారే" ఇలాగ. వంగభాషలో, వంగీయుల వ్యావహారిక ఉచ్చారణలో ఒక స్వేచ్ఛ ఉంది. అది దీర్ఘాలను దీర్ఘాలుగా పాటించక పోవడమే. 'మొనెరొ్బె కినరొ్బె అమరె' ఇలా. ఇంతే కాక, వంగ పదాలలోని హలంతాలలో జాల్, డాల్; తార్, తాహార్ – ఇలాగ ఒక విచిత్ర శక్తి ఉంది. వంగ వ్యావహారిక భాషలోని విశిష్టమైన శక్తిని గురుదేవుడు తన గేయాలలో కూడగట్టుకున్నాడు.

—రేడియో ప్రసంగం.

# బర్న్స్ కవి కవితామాధురి

మనకూ బర్న్స్‌కూ రెండువందల సంవత్సరాల దూరం, కొన్ని వేల మైళ్ల దూరం. మనకూ బర్న్స్‌కూ జాతి అడ్డు, మతం అడ్డు, ఆచారం అడ్డు, సంస్కారం అడ్డు. అయితే మనం మనుష్యులం. బర్న్స్ మనుష్యుడు. లేకపోతే అతని కావ్యం ఈనాడు ఈ దేశంలో చదివి మనం కరగడ మేమిటి? అతడు మహాకవి అని మనం గౌరవంతో, అనురాగంతో స్మరించుకోవడ మేమిటి? పోనీ, దీనిని ఒకలాగ సమర్థించుకోవచ్చు. అతని భాష మనం చదువు కున్నాం కనుక, అతను ఆ భాషలో వ్రాసిన గొప్పకవి కనుక.

అయితే అతను గొప్పకవి అని అనుకోవడమే అద్భుతంగా ఉంటుంది - మనకు అలవా టైపోయిన కొన్ని మానాల్ని, కొలతల్ని బట్టి చూస్తే! ఏమిటవి? ఒకటి అతడు అసలు వ్రాసింది తక్కువ. అన్నీ ఖండ కావ్యాలే. ఒక గొప్ప ఎపిక్ గాని, నాటకం గాని ఏమీ వ్రాయ లేదు. అయితే, ఇతనిది ఏ ఒక్క చిన్నకావ్యం మిగిలినా, చదివినా, అది ఒక్కటే చాలు ఇతనిని మహాకవి పీఠం మీద కూర్చుండ బెట్టడానికి అని అనిపిస్తుంది మనకు. రెండు: ఇతని కావ్య వస్తువులు బొత్తిగా సామాన్య మైనవి. చాలా సామాన్యుల్లో మరీ సామాన్యు లైనవాళ్లు, వాళ్ల మామూలు అనుభవాలూ -

నవ్వకండేం! చిట్టెలుక, కుక్క, ముసలిగుర్రం - వీటి మీదా, ఇటువంటి వాటి మీదా అతడు కావ్యాలు వ్రాసేడు.

మరి ఆ కావ్యాల్లో వాడిన భాష? స్కాట్లండు దేశంలో నిరక్షరాస్యులైన కర్షకులూ వాళ్లూ నిత్యమూ వాడుకునే భాష! జానపదుల భాష! బర్న్సే ఒక కావ్యంలో ఇలా వ్రాస్తాడు: "నా సరస్వతి నా వైపు ఎప్పుడు దయగా చూస్తే, అప్పుడు ఏదో గలగల మని గంటలు మోగిస్తారు. మహా చదువుకున్న విమర్శకులు పెదవి విరిచి, బొమలు ముడిచి, మొహం తిప్పుకుని, 'ను వ్వేమిటి, కవిత్వం చెప్పడమేమిటి? నీకు పద్యానికీ, గద్యానికీ తేడా తెలుసునా? నీకు లాటిన్ వచ్చునా, వ్యాకరణం వచ్చునా? నువ్వు పొలం దున్నుకునే వాడవు. నీ నాగలి పట్టుకో, లేకపోతే రాళ్లు కొట్టుకో' అని వెటకారం చేస్తారు. నాకు వాళ్లమాట లంటే లక్ష్యం లేదు. వాళ్లు కవితా కైలాస శిఖరం మీదికి కేవలమూ పాండిత్య సోపానాల మీద ఎక్కుతా మంటారు.

They think to climb Parnassus by dint of Greek
Give me a spark of Nature's fire
That is all the learning I desire
Then though I drudge through dub and mire
At plough or cart
My Muse, though homely in attire
May touch the heart ....."

నిజానికి ఏ శబ్దానికి శక్తి లేదు? ఏ శబ్దానికి గౌరవం లేదు? ఈ లోకంలోనూ లేదు, శబ్ద లోకంలోనూ లేదు అస్పృశ్యత అనేది. పనికి రాని పదం అంటూ ఏముంది? నా తల్లీ, నా ఆత్మా, నా బిడ్డా, నా నేస్తం, నా తోడివాళ్లూ పగలూ రాత్రీ, ఇంటా బైటా మాట్లాడే వాటిలో, ఎంత బాగుంటాయి అవి! వాటికి ఎంత

శక్తి ఉంది! వాటి సాయంతో మనం చెప్పుకో లేని దే ముంది? ఒకడి నోట్లో చప్పగా జావలాగ కాళ్లు చాపి చతికిలబడి పోయే మాట, ఒక మహాకవి నోట బైటపడి, మనిషై పోయి, మనల్ని చేయి పట్టుకుని, నిలబెట్టి మన గుండెలమీద తలబెట్టి, కష్ట సుఖాలను చెప్పుకుంటుంది. ఎటొచ్చీ ఆ మాట ఉచ్చరించే నోటికి నిజాయితీ ఉండాలి. వేడీ, వాడీ ఉండే నో రైఉండాలి. బర్న్స్ చెప్పిన నేచర్స్ ఫైర్ (Nature's fire) – ప్రతిభ – ఉండాలి ఆ మాటలు అన్నవాడికి –

"నా నోట నీ మాట గాన మయ్యే వేళ
నా గుండె నీ వుండి మ్రోగింపవా వీణ"

అన్నట్టు.

ఇక్కడ మన 'యెంకి పాటల' కవి జ్ఞాపకం వస్తున్నాడు. ఒక్కొక్కప్పుడు సుబ్బారావును బర్న్స్‌తో పోల్చా లనిపిస్తుంది. ఈ గేయ కర్త లిద్దరికీ కవితా ధోరణిలోనే కాదు, లోకాన్ని తృష్ణతో చూసే ఆ పెద్దకళ్లూ, చూపుల్లోనూ సామ్యం ఉం దనిపిస్తుంది. యెంకీ, నాయుడు బావా తీర్థాలకి వెళ్లడం, తానాలు చెయ్యడం, పడవలపై ప్రయాణం, తలపై మూటలూ, చంకన పిల్లవాడూ, ఆవూ, పెరడూ, తోటా, ఏరూ, పొలంగట్టూ, గడ్డిమేటూ అన్నిటినీ, జానపదులు వాడుకునే మాటల్లో పొదిగి, మాన వానుభూతుల్లో ఎట్టి ఎత్తులూ, ఎట్టి లోతులూ అందుకున్నాడు అతను! అతని మాట మనిషే గాదు – అది పాట గనక, ఒక్కొక్క చోట పక్షి కూడా! బర్న్స్ పద్యాలు వ్రాసేడు, పాటలూ వ్రాసేడు. రెండూ గొప్పవే. అయితే అతని పాటలు మరీ గొప్పవి. కార్లయిల్ ఒక చోట అంటాడు:

"Our Scottish son of thunder had to pour his lightning through the narrow cranny of a Scottish son, the

narrowest cranny ever vouchsafed to any son of thunder."

అన్ని సాహిత్య రూపాల్లోకీ గేయం ఎక్కువ లోతులకు చొచ్చుకు పోతుంది అంటూ రోకరు. బర్న్స్ గేయకర్తల్లో ప్రభువు. రెండు ప్రభావాలు కలిసి అతనికి ఆ పదవి నిచ్చాయి. తరతరాల స్కాట్లండ్ దేశపు జానపద సంగీతం, జానపద వాఙ్మయం అతని బాల్యంనుండీ అతని లోపల నిండి, అతని జీవితంలో నరనరాల్లో ఇంకి, అతనికి ఊపిరి అయిపోయాయి, ప్రాణం అయిపోయాయి. పాత వరసలు, పాత మాటలు, పాత కూర్పులు - అన్నీ మననం చేసి చేసి తనవిగా చేసుకున్నాడు. చేసుకుని మళ్లీ వాటిని పదే పదే తనలో తాను పాడుకునే టప్పటికి, ఒక్కసారే హఠాత్తుగా తీగ మీద పూర్తిగా వికసించిన పువ్వులాగ అతనికి పాట వచ్చేసేది - పాట తరువాత పాట. ఈ పాట గాని, పద్యంగాని కవి మనస్సులో ఎలాగ పుడుతుందో! ఎలాగ రూపు తాలుస్తుందో! మాటా, వరుసా మెలి వేసుకుని, పెనవేసుకుని, ఒక్కసారి ఇతరులకు, ఒక్కసారి ఇవతలకు ఉరుముతా యనుకుంటాను – సుబ్బారా వన్నట్లు "దేవుడల్లే లోన తిరిగి తిరిగీ". అది గొప్ప ముహూర్తం. అందుకనే కొందరు కవులు, తరువాత తమ కావ్యాలు చదువుకుని, ఇవి నేనే వ్రాసేనా, వ్రాయ గలిగానా అనుకుంటారు. అన్నట్టు, బర్న్స్ ఏదో ఒక అలౌకిక శక్తి ప్రేరేపిస్తే వ్రాసిన కవి.

మంచి పాటలు వ్రాసేవాడికి, నిజమైన పాట వ్రాసేవాడికి లోపల కూడా అంతరాంతరాల్లో సంగీతం వచ్చి ఉండాలి. ఏ అనుభూతికి ఏ రాగమో, ఏ వరసో, ఏ విరుపో, ఎక్కడ ఏ నొక్కో, ఏ ఒదుగో, సరిగా మాటా అవీ కలిసి వస్తాయి. నే ననుకుంటానూ, గేయానికి ఎక్కువ నగలు తొడగకూడ దని – శబ్దార్థాలంకారాలూ అవీ! వాటి బరువు పాటని ఎగర నివ్వదు, లోతులకు దివ్వమని

దిగ నివ్వదు. విలాసంగా కాళ్లూ, చేతులూ, తలా ఊపుకుంటూ పాట నడవాలి. అలంకార భారం అలాగ చేయనీయదు. అయితే ఏరిన మాటల్లోనూ, ఆ మాటల కూర్పులోనూ జీవమూ మాధుర్యమూ ఉండి తీరాలి. ఇంకొక్క సంగతి: ఒక్కొక్క శబ్దం హాయిగా ఉండవచ్చు. అయితే అది పరిసర శబ్దాల్తో కలిసి నప్పేది కూడా అయి ఉండాలి. అంటే, అదీ అవీ కలిసి పోయి ఒకదానితో ఒకటి అతుక్కుపోయి మళ్లీ హాయ్ అనిపించాలి. గొప్పగేయం (లిరిక్) వినడం చాలు. దానిలోని వస్తువుకి సంబంధించిన ఒక మనస్థితిలో మనం పడిపోతాం. బర్న్స్ గేయకర్తలలో చక్రవర్తి. అతని మొట్ట మొదటి రచన గేయం. ఆఖరిది గేయం. మొత్తం మీద దాదాపు 300 గేయాలు వ్రాసేడట. ఏదీ కూడా ఒత్తిడి మీద, కావా లని కూర్చుండి వ్రాసింది కాదు. బాగా హృదయం నిండిపోయి నప్పుడు పట్టలేక పాటల్లో చెప్పుకునే వాడు బర్న్స్. అందుకనే అతనిపాట ఒక్కసారి పూర్ణాకృతితో మొదటినుండి చివరిదాకా ఈవలకు వచ్చిపడ్డట్టుంటుంది. అందుకనే అతడు పాటలపుట్ట లాగ ఉంటాడు. ఉఁహుఁ - వసంత కాలంలో ప్రభాతవేళ వేణుకుంజంలా గుంటాడు. మంచులో తడిసిన పువ్వులతో ప్రత్యక్ష మయే పొదలా ఉంటాడు. ఉఁహూఁ! తెల్లవారగట్ల పక్షిగూడులా ఉంటాడు. కొన్ని వాగులు గలగల మని పాడే కోనలా గుంటాడు. కాని ఎట్టి వేడిలో, ఆవేశంలో పాట వ్రాసినప్పటికీ, తరువాత పదమూ, పంక్తీ, చరణమూ దిద్ది, మార్చి వాటికి వన్నె, వాసన పూసి తయారు చేసేవా డట, ఒక్కొక్కప్పుడు - "Ye banks and braes" అనే కావ్యంలో లాగ. అప్పుడు ఆ రచనకి ఆర్ద్రతా, ఆప్తతా, శిల్పలావణ్యమూ కూడా కలిగేవి. పైరూపం సమగ్ర సుందరంగా, లోపల గానం అంతర్వాహిని లాగ అంతా నిండి ఉంటుంది. రెండూ మనో హరంగా మేళన మైపోతాయి. అందుకనే అతని గేయాలలో, "the outward form is as perfect as the inward

music is all pervading and the two are in complete harmony" అని కీర్తిస్తాం. ఒక కవి బర్న్స్‌కి స్కాట్లండు ఎలాగ రుణపడి ఉన్నదో వ్రాస్తాడు! "These old Scottish melodies, sweet and strong though they were, were all the more, for their very strength and sweetness, a moral plague from the indecent words to which many of them had long been set. How was the plague to be stayed? All the preachers in the land could not divorce the grossness from the music. The only way was to put something better in its stead. This inestimable something Burns gave us."

బర్న్స్ స్కాట్లండు దేశపు కవి. ఆ జాతికి ఇతని మీద ఉన్న గౌరవమూ, మక్కువా మరి ఏ కవిమీదా లేవు. దీనికి కారణాలు రెండు. మొదటి కారణం ఇది— బర్న్స్‌కు పూర్వం స్కాట్లండు చాలా చితికిపోయి ఉంది. నూరేళ్ళ మతకలహాలు చాలా బొత్తిగా నీరసింప జేసేయి ఆ జాతిని. తరువాత ఆ దేశపు రాజుల్ని తరిమేసేరు ఇంగ్లీషువారు. నాటికి స్కాట్లండు జాతీయ అభిమానం అడుగంటిపోయింది. పూర్వగౌరవం చప్పగా జారిపోయింది. పార్లమెంటు పోయింది. పైనున్న ఇంగ్లీషువారు వీళ్ల నసహ్యించుకునే వారు. చివరకి తామన్నా, తమదేశమన్నా, స్కాట్లండు దేశస్థులకే అప్పు డెంతో సిగ్గూ, చిన్నతనమూను. అప్పటి స్కాచ్ కవులకూ, పండితులకూ స్కాట్ అనిపించుకోడం భయంగా ఉండేది. అప్పుడు బర్న్స్ అవతరించాడు. స్కాచ్ భాషను దివ్యభాషను చేసేడు. స్కాచ్ జానపద భాషకీ సాహిత్య గౌరవం సంపాదించి పెట్టాడు. కర్షకునికి సమ్రాట్ గౌరవం ఇచ్చాడు. గడ్డ కట్టుకుపోయిన స్కాచ్ నదులకు ప్రాణం పోసి, కరిగించి, గలగల ప్రవహింపజేసేడు. స్కాట్లండ్, దాని ప్రకృతి సౌందర్యమూ, అక్కడి ప్రజల

శౌర్యమూ, ఆభిజాత్యమూ అన్నీ ఉజ్జ్వల గౌరవంతో, గర్వంతో సాక్షాత్కరింప జేసేడు తన దేశస్థుల ఎదుట :

"ఈ వా పదార్పిత క్షోణి
ఏ రాజు ధర్మాసవం బుండి
స్మృత్యర్థ మనెవో ?"

అన్నట్టు.

ఇలాగ స్కాట్లండ్ జాతీయతను ఉద్ధరించడంమాత్రమే కాదు. ఇంకో గొప్ప గుణం ఉంది అతనిలో, తన దేశస్థులకు అతన్ని ప్రియుణ్ణి చేసింది. అది అతని నిజాయితీ. అంటే, వాస్తవికత - అంటే, తన పరిసరాలను వదలకపోవడం - అంటే, వాటికి ఎన్నడూ దూరుడు కాకుండా ఉండటం. బర్న్స్ కర్షకుడు. అతని తండ్రీ, తాతా తరతరాల నుంచీ కర్షకులే. అతనికి వాళ్ళభాష వచ్చును, వాళ్ళ పాటలే వచ్చును. వాళ్ళకి వచ్చిన కష్ట సుఖాల వంటివే అతనికీ వచ్చాయి. వాళ్ళెరిగున్న కొండల్నీ, నదుల్నీ, జంతువుల్నీ వాటినే అతడూ ఎరుగును. అతని చూపు గరుత్మంతుడు - అతని చూపు అసికొన. ఇక అత నేది చూసినా దానిని స్పష్టంగా చూసేవాడు. అయితే అతని కన్నులు శరత్సరస్సులు కూడా, ఎంత కలకదేరి ఉండేవో అంత చల్లనివి. చాలా దయతోనూ, ప్రేమతోనూ చూసేవాడు. మానవ జీవితంలో నవ్వు గలిగించేవీ, జాలి పుట్టించేవీ అన్నీ అతనికి తెలుసును. ఈ తెలివి, ఈ ఎరుక, ఈ నిజాయితీ బర్న్స్‌ను స్కాట్లండు దేశస్థులకు ప్రియతముణ్ణిగా చేయటమే గాక, అతని మాటలకు ఋషివాక్కున కుండే చైతన్య మిచ్చాయి. దానిని ఉజ్జ్వల మంత్రంలాగ చేసేయి. వర్డ్స్‌వర్త్ వంటి జగజెట్టి బర్న్స్‌ని తన గురువుగా చెప్పుకుంటూ—

"Whose light I hail when first it shone
And showed my youth

How verse may build a princely throne
On humble truth"

అని కీర్తించాడు.

అయితే బర్న్స్ స్కాట్లండ్ జాతీయ కవి మాత్రమే కాడు. అతని ఊహలు, అతని అనురాగాలూ విశ్వజనీన మానవులకు చెందినవి. అతని హృదయం లోకమంత విశాల మైనది. అతని ఆవేశమూ, ఉత్సాహమూ, నిర్లిప్తతా, అన్యాయ మంటే ఆగ్రహమూ, అవధు లెరుగని కరుణా, ఆర్జవావేశమూ, లక్ష్య శుద్ధీ – ఇవన్నీ అతన్ని విశ్వమానవ కవిని చేసేయి. ఏ సీమలో ఉన్నా, ఏ కాలంలో ఉన్నా మానవ హృదయం ఒక్కలాగే కొట్టుకుంటుంది. తల్లీ బిడ్డా, ఆలూ మగలూ, అన్నా తమ్ముడూ - వీళ్ల అనుబంధాలూ, వీటికి సంబంధించిన ఆవేశాలూ, అనుభవాలూ ఎప్పుడూ ఒకలాగే ఉంటాయి. బర్న్స్‌కి స్కాచ్ కర్షకుడు కూడా ఒక మనిషి. అందు కని వానిమీద అతని కంత గౌరవం. అందుకని అతని అనుభవాని కత డంత విలువ నిస్తాడు. బర్న్స్ హృదయం అక్కడ ఆగలేదు. మృదుల కరుణా మధురం కవిహృదయం. తన వేదన, ఇతరులది కూడా తన దైపోయిన వేదన. పాపం, మృదుల కరుణా మధుర హృదయం. ఒకసారి బర్న్స్ పొలం దున్ను తున్నాడు. ఒక ఎలుక కట్టుకున్న చిన్నగూటిని అతని నాగలి పెల్లగిస్తుంది. అది భయపడి, పరుగెత్తు తుంది. బర్న్స్ అప్పు డంటాడూ — ఎలాగ దానిని నా మాటలలో చెప్పడం ?.... దాని సారాంశ మిది :

ముడుచుకొన్న, కుంచుకొన్న
చిన్ని ఒడలూ, నువ్వూ - పాపం,
నీ గుండెలోన
ఎంత భయం, ఎంత భయం!....

పరిగెత్తకు త్వర త్వరగా
భయపడ కాలాగు ! నిన్ను
తరమనులే, ఒరిగిపోయి, ముడుచుకుంటు పరిగెత్తే నిన్ను
తరుమలేను.
ఏమి మానవుడులే, ఉన్నది ఒక సంబంధం
నీకూ నాకూ తెగనిది,
ఏకంగా జేసినది నిన్నూ నన్నూ !

ఏమి మానవుడో గాని ఆ బంధం త్రెంచుతున్నాడు. లేకపోతే ఈ లోకంలో నీతోపాటు పుట్టిన వాడినే కదా! నన్ను చూసి ఎందుకు బెదురుతావు? ఎప్పుడైనా ఒక ధాన్యపు గింజో ఏదో దొంగిలిస్తా వనా? అయితే నువ్వు మాత్రం బ్రతక వద్దూ, పాపం! శీతకాలం వస్తూంది. వల్లమాలిన చలీ, మంచూను. అటువంటి సమయాన నీ చిన్న ఇంటిని ఇలాగ నాశనం చేసేను. ఎంత శ్రమ పడి కట్టుకున్నావో ఆ ఇంటిని. అలిసిపోయి అలిసిపోయి ఒకఆకు కొరికి ఒకపుల్ల తెచ్చి ఎలాగ కట్టుకున్నావో! చివరకు నీకు ఇల్లూ, వాకిలీ లేకుండా తరిమేసేను. ఈ చలికాలంలో ఏ మవుతావో? నా చిట్టి ఎలకా! నువ్వు ఏకాకి వనుకోకు. మానవు ణ్ణయిన నేనూ అంతే ఎపుడో! మన ముందు చూపూ, జాగ్రత్తా వృథా సుమా. ఎల కైతే నేం, ఈ మని షైతే నేం - ఇద్దరికీ చివరి కంతా దుఃఖం, బాధా మిగలవచ్చు! అయినా నువ్వు నా కంటె నయమేలే. నువ్వు ఈ నిముషం ఏం బాధపడతావో అంతే! ఇక నేనో? వెనక్కి చూసుకోలేను. చూసుకుంటే అంతా విషాదం! ముందుకు చూద్దా మని ప్రయత్నించటానికి కూడా భయం ... ఎట్టి గొప్పకావ్యం ఎలా గైపోయిందో నా మాటల్లో! ఏం జెయ్యను? ఆ మహాకవిని క్షమించ మని ప్రార్థిస్తున్నాను.

—రేడియో ప్రసంగంగా ప్రసారితం (26-2-1959)

# ఎడ్గార్ ఏలన్ పో

జీవిత మంటే సుఖదుఃఖాలు రెండూ కలిసి ఉంటాయి. సంధ్యా కాశంలా ఉంటుంది జీవితం, వెలుగు చీకట్లు కలిసి. ఎవ్వరి దేనా అంతే - దగ్గరగా చూస్తే. అయితే, ఒక్కొక్కడి బ్రతుకు ఉదయసంధ్య లాగ ఉంటుంది. మరొక్కడిది సాయం సంధ్యలాగ ఉంటుంది. మొదటి రకం జీవితాన్ని చూస్తే మనకు ఉల్లాసం కలుగుతుంది. దానిలో వెలుగు పా లెక్కువ అనుకుంటాను - బంగారపు కాంతి. అది మంచుతోటి కడిగివేసిన ట్టుంటుంది. రెండో రకపు దానిలో రక్తచ్ఛాయ ఎక్కువ, చీకట్ల పా లెక్కువలా ఉంటుంది. అది చూసేవాడి మనసులో దిగులు కలిగిస్తుంది. అందరి జీవితాల్లాంటిదే కవి జీవితమూను. ఎంత అల్ప మైన దైనా ఒక్కొక్క అనుభూతి కవిని ఎక్కువ ఊపేయవచ్చు. కాని, మొత్తం మీద, రకరకాల సుఖదుఃఖాలతో, ఇతర మానవ జీవితాల్లాగానే ఇతని జీవితమూ ఉంటుంది.

అలాగే కొందరు కవుల జీవితాలను గూర్చి వివరాలను తెలుసుకున్నా, వారి రచనలు చదివినా, - ఏదో చల్లగా, నిదా నంగా అతగాడు నిండుగా బ్రతి కా డనిపించి, మనకు హాయి అనిపిస్తుంది. వర్డ్స్వర్త్, టెన్నిసన్, ఠాకూర్ వంటి కవులవి లాగ. మరి కొందరి జీవిత గాథలు తెలుసుకుంటే దిగులు వేస్తుంది. వీళ్ల బ్రతుకులకు చీకటి, రక్తము అంటుకున్న ట్టుంటుంది. వీళ్లు

తమ బ్రతుకుల్ని కాల రథచక్రాల క్రింద పారేసి, మార్గానికి కూడా రక్తపు మరకల్ని అంటించి, బలవంతంగా ముగించి నట్టు తోస్తుంది. వీళ్ల రచనలు కూడా చెప్ప లేని బెంగా, భయమూ కలి గిస్తాయి.

"పో" నా కలాగ అనిపిస్తాడు. ఇతని జీవితానికి ఒక మార్గం ఉన్నట్టు ఉండదు. తుఫాన్‌లో, సముద్రంలో, పడవలా గుంటుంది. జాగ్రత్తగా, దారి బత్తెం ఉపయోగించుకుంటూ నడిచే యాత్రి కుడు కాడు 'పో". కళ్లు మూసుకుని, జీవితాన్ని రెండు చేతులతో ఖర్చు పెట్టిన ట్లుంటాడు. తనకు సంబంధం లేని లోకంలోకి వచ్చిన ట్లుంటాడు - అతని 'రేవెన్' (Raven) అనే కావ్యంలోని కాకి లాగ - ధగధగ మండే కళ్లూ, అదీను.

మనలో చాలామందికి పరిచయం తక్కువ ఎడ్గార్ ఏలన్ పో కవితో.

ఇతని రచనలు సాధారణంగా మన పాఠ్య గ్రంథాలలో ఉండవు. లాంగ్‌ఫెల్లో, విట్టియర్, విట్‌మన్, ఎమర్సన్, హాథా రన్ - వంటి అమెరికన్ గ్రంథ కర్తల రచనలే మనం చిన్నప్పుడు చదువుకున్నాము. వా ళ్లిప్పుడు పాత బడ్డారు, విట్‌మన్ తప్ప. అమెరికా నుంచి ఇప్పుడు వినవస్తున్న రచయితల పేర్లు కొత్తవి. "పో" అమెరికా దేశస్థుడే, కొత్తవాడు కాదు కూడా.

సరిగ్గా 150 ఏళ్లయింది ఇతగాడు పుట్టి. కాని ఇతని పేరు చాలా అలస్యంగా—దాదాపు ఈమధ్యనే లోక మంతా పాకింది. 1809 లో పుట్టి 1849లో పోయాడు—అమెరికా బోస్టన్‌లో. తలిదండ్రులు నటులు. తండ్రి చిన్నప్పుడే కుటుంబాన్ని విడిచిపెట్టి పారిపోయాడు; తల్లి చిన్నప్పుడే పోయింది. ఏలన్ అనే అతను ఇతన్ని పెంచు కున్నాడు. ఏలన్ భార్యకు ఇతని మీాద వల్లమాలిన మక్కువ. పెంచి

పెద్దవాణ్ణి చేసేరు "పో"ని. యూనివర్సిటీ చదువులు చెప్పించారు. కాని, అక్కడ తాగుడూ, జూదం అలవాటు చేసుకుని అప్పుల్లో పడి "పో" యూనివర్సిటీ నుంచి పారిపోయి, 18 వ ఏట "Tamerlane and Other Poems" అని ఒక కావ్య సంపుటం ప్రచురించాడు. రెండేళ్లు అమెరికా సేనలో పని చేసేడు. అక్కణ్ణుంచి డిస్మిస్ చేసేరు. పెంపుడు తండ్రికి కోపం వచ్చింది. "పో"ని వదలుకొన్నాడు. తరువాత "పో" మరొక పద్యాల సంపుటి ప్రచురించాడు. తరువాత ఒక కథ వ్రాసేడు. దానికి బహుమానం వచ్చింది. దాని వల్ల సాహిత్య లోకంలో కొంత కీర్తి, సాహితీ పరులు కొందరితో స్నేహం లభించాయి. అప్పుడే ఒక సాహిత్య పత్రికకు సంపాదకుడు అయాడు. మరి నాలుగేళ్లకి పధ్నాలుగేళ్ల పిల్లని పెళ్లి చేసుకుని, పత్రికా సంపాదకత్వం వదలుకొన్నాడు. న్యూయార్కు పట్టణం వెళ్లారు భార్యాభర్తలు. అక్కడ పత్రికలకు అవీ ఇవీ వ్రాసి నానా తంటాలూ పడినా చాలా దరిద్రస్థితిలో ఉండేది సంసారం. అతడు చాలా కథలు వ్రాసేడు - ముఖ్యంగా చెప్పవలసింది "Tale of the Grotesque and Arabesque." తరువాత "The Gold Bug" అనే కథా, "The Vortex" అనే పద్యాన్నీ వ్రాసి చాలా పేరు తెచ్చుకున్నాడు. 1847లో అతని భార్య దిక్కుమాలిన పేదతనం వల్ల జబ్బుపడి చనిపోయింది. తరువాత "పో" రెండేళ్లు బ్రతికాడు. ఆ రెండేళ్లలోనూ ముగ్గురిని ప్రేమించాడు. మళ్లీ పెళ్లికి సిద్ధ పడుతున్నాడు. ఇంతట్లో బాల్టిమోర్ అనే చోట తప్పతాగి స్మృతి లేక పడిపోయి ఆ స్థితిలోనే చనిపోయాడు. ఇదీ సంగ్రహంగా "పో" చరిత్ర.

ఈ కాస్త చరిత్రా వింటేనే మనకు "అయ్యో! ఏం ఒడుదుడుకుల బ్రతుకు!" అనిపిస్తుంది. దీనికి తోడు, అతనికి ఒక అన్యాయం కూడా జరిగింది. "పో" ఒక దుర్ముహూర్తంలో తన సాహిత్యపు వారసుడుగా గ్రిస్వోల్డ్ (Griswold) అనే అతన్ని నియమించాడు.

ఈ పెద్దమనిషి సగం సత్యాలు, పూర్తిగా అబద్ధాలు కలిపి "పో" చనిపోయి రెణ్ణాళ్ళు అయిందో లేదో అతని జీవితగాథ అని ప్రచురించాడు. దానితో "పో" వ్రాసినట్లు దుర్మార్గపు ఉత్తరాలు కూడ ఫోర్జ్ చేసి ప్రచురించాడు. లాంగ్‌ఫెల్లో వంటి పెద్ద మనుష్యులు "పో"ని వెనకేసుకుని వచ్చారు. కాని గ్రిస్‌వోల్డ్ చేయ గలిగిన హంగామా అంతా చేసేడు. దీనివల్ల "పో" వర్తన, శీలము ఎంత చెడ్డగా నైనా లోకానికి కనబడింది. అతనిని దూషించినవారు దీనితో మరీ లేనివి కల్పించడం వల్లా, భూషించినవారు అతిశయోక్తు లతో మరీ కీర్తించడం వల్లా, "పో"యే బడాయి కోసం తన్ను గూర్చి మంచివీ, చెడ్డవీ - ఉన్నవీ, లేనివీ వ్రాసుకోవడం వల్లా, నిజంగా అతన్ని గూర్చి, కొంతవర కైనా, సరి యైన చరిత్ర తేల డానికి నూరేళ్ళు పట్టింది. ఈ నూరేళ్లలోనూ, తరవాతనున్నూ అతనిని కొందరు పిచ్చివా డన్నారు. అతనికి వాస్తవిక లోకంతో సంబంధం లే దన్నారు. అతని రచనలు ఉల్లాసమూ, మనస్సుకు క్షేమమూ కలిగించేవి కా వన్నారు. అతని వ్రాతలు తుక్కూ ధూళీ అన్నారు. ఎమర్సన్ (Emerson) వంటి వాడు "పో"ని - ది జింగిల్ మేన్ (The Jingle Man) ఊరికే చప్పుడు చేసే వాడు - అని తోసి పారేసేడు. లొవెల్ (Lowell) "పో" రచనల్లో అయిదు పాళ్లలో మూడు పాళ్ల ప్రతిభ, రెండు పాళ్లు వట్టి అర్థం లేని తుక్కు ఉం దన్నాడు. అయితే "పో" ప్రభావం యూరపులో 1852 తరువాత బ్రహ్మాండంగా వ్యాపించింది. వెర్‌లైన్ (Verlaine) అనే ఫ్రెంచి గ్రంథకర్త "పో" రచనా శిల్పమున్నూ, సౌందర్య దృక్పథమున్నూ చూసి ముగ్ధుడైపోయాడు. ఇతనికి నీతులు బోధించే కవిత్వమంటే ఉన్న అసహ్యమూ, ఇతని రచనలో ఉండే చిత్ర శబ్దగానమూ మొదలైన గుణాలు చూసి మరి కొందరు ఫ్రెంచి గ్రంథకర్తలు "పో"ని ఆకాశం మీది కెత్తి అతని ప్రభావంలో పడి పోయారు. దోస్తవిస్కీ అనే రష్యన్ గ్రంథకర్త "The Black Cat and the

Telltale Heart'' అనే కథలను రష్యన్‌లోకి అనువదించాడు. విజ్ఞాన శాస్త్రానికి చెందిన ఇతని కథలున్నూ, ఇతని అపరాధ పరిశోధక కథలున్నూ H. G. Wells, A. Conon Doyle మొదలైన వాళ్ల రచనలను ప్రభావితం చేసేయి.

''పో''కి ప్రసిద్ధి వచ్చింది. ''పో'' గేయ కావ్యం వ్రాయడంలో అసాధ్యు డని కొందరు అంటారు. ఈ గేయ కావ్యంలో ముఖ్య గుణం ఆత్మాశ్రయత అనిన్నీ, మనోహర మైన పదాలు కూర్చి ఒక విధ మైన ఊపుతో, ఛందస్సుతో నడిపించి, వెరసి ఒక విలక్షణ మైన గానం పుట్టిస్తుం దనిన్నీ ''పో'' అంటాడు. ఈ కావ్యాన్ని పూర్తిగా అనుభవించడానికి ఎవరైనా చదివి వినిపించి నపుడు ఆలకించా లంటాడు. ఎందువల్ల నంటే, కవిత్వం సంగీతానికి చాలా సన్నిహిత మంటాడు. మనము చెప్పుకో లేని ఆలోచనలూ, మనస్సులలో సగం సగం ఏర్పడి అస్పష్టంగా ఉన్న ఆలోచనలూ, చితికి పోయిన మన కోర్కెలూ, అణచిపెట్టిన మన ఆవేశాలూ, అన్నీ కవి ఈ గేయ కావ్యం ద్వారా వ్యక్తపరచి వాటికి ఆకృతి ఇచ్చి బయటికి తీసుకొని వస్తాడు అంటాడు. . . . ఇటువంటి గేయ కావ్యాలలో సామాన్య జీవితాన్నీ, ప్రకృతి సౌందర్యాన్నీ వర్ణించాడు. ప్రజాస్వామ్య లక్ష్యాన్ని ప్రకటించాడు. పూర్వ వైభవాలను పునః సృష్టి చేసేడు. మేధ యొక్క ఉజ్జ్వల లావణ్యాన్ని కీర్తించాడు. బల మైన ఆశ పఠితల మనస్సులో కలిగించాడు.

''పో'' అలౌకికమైనవి, భయంకరమైనవి, విలక్షణమైనవి, దిగులు కలిగించేవి, అస్పష్టంగా ఉండేవి అయిన వస్తువులు తీసుకొని, వింతగా మోగే శబ్దాలూ, అనుప్రాసల సాహాయ్యము తీసికొని, మనం ఎన్నడూ అనుభవించని మనస్స్థితిలో మనలని పారేస్తాడు. 'మాలకాకి' అనే ఖండిక ఎలాగ మొదలుపెడతాడు ? ఏకాకి, రాత్రి. ''అర్ధరాత్రి అలసిపోయి ఏదో ఆలోచిస్తూ ఒరిగి ఉన్నాను. కొంచెం

కునుకుతున్నాను. తలుపు అవతల ఎవరో తట్టినట్టు అనిపించింది – మెల్లగా పడుకున్న గది తలుపు మీద. 'ఎవరో నాకోసం వచ్చారు కాబోలు! అదీ ఆ తట్టిన చప్పుడు! అంతే. అంత కంటే ఏమి లేదు' అనుకున్నాను. నాకు బాగా జ్ఞాపకం. చలివల్ల గడ్డ కట్టుకు పోయే డిసెంబరు రాత్రి. గదిలో చలికోసం వేసిన మంటలో ఒక్కొక్క ఆరిపోయే కట్టెలో దయ్యాలులాగ నీడలు కదులుతున్నవి. తెల్లారితే బా గుండును అనుకున్నాను. పోయిన ప్రియురాలు లెనోర్ కోసం నాదుఃఖం మరచిపోదాం అనుకున్నాను,'' అంటూ Raven, అంటే నల్లకాకి అనే కావ్యం మొదలు పెడతాడు, తాను తలుపు దగ్గరకు ఎలా వెళ్లాడో, తలుపు ఎలాగ తెరచాడో. చీకటి తప్ప మ రేమీ అక్కడ తన కేలాగు కనపడలేదో, తాను లెనోర్ అని ఎలాగ మెల్లగా అన్నాడో, ఆమాట తన దగ్గరకు ఎలాగ తిరిగి వచ్చిందో, తరవాత ఓ నల్లకాకి ఆ చీకట్లో తన గదిలోకి వచ్చి ఎలాగ వాలిందో, దాని కళ్లు ఎలాగ ధగ ధగ మండిపోతున్నాయో, ఏ మడిగినా ఆ కాకి 'Nevermore- ఇంకె ప్పుడూ జరగదు, ఇం కెప్పుడూ లేదు' అని ఎలా జవాబు ఇచ్చిందో, లెనోర్‌ని గురించి తాను ప్రశ్నించినా, 'Nevermore' అని ఆ కాకి ఎలాగ అరిచిందో, ఆ పద్యంలో వ్రాసుకు పోతాడు. చీకటి, భయం, గాలి, అర్ధరాత్రి, హేమంతం, ఏకాకితనం, నల్ల కాకి, మరణం, సమాధి, నిరాశ – ఎన్నో ఈ గేయంలో ప్రతి పదంలో, ప్రతి పంక్తిలో అనుప్రాసలతో, వింత వింత నడకలతో.

ప్రతి పద్యం చివరనా 'Nevermore' అని ఒకే మాట రావడంతో మనం ఎన్నడూ ఎరగని వాతావరణం ఏదో తయా రవుతుంది. ఇది ''పో'' ప్రతి పద్యంలో కనపడుతుంది. ఇది అతని కథలలోనూ కనపడుతుంది. ఇదీ, అతని శక్తి. కాని చదివాక, దిగులుగా మాత్రం ఉంటుంది.

—రేడియో ప్రసంగంగా ప్రసారితం: **19-1-1959**

## అనుబంధం:

# ఉదాహృత పద్యాదులకు ఆకరాలు

| పుట | ఉదాహృత పద్యాదులు | కృతి | వివరం |
|---|---|---|---|
| 1 | కులబ్రాహ్మణుడు, అనురక్తుడు | భారతం - ఆది | 1 - 9 |
| ,, | ఆంధ్రకవిత్వవిశారదుడు. మహితాత్ముడు, | భారతం-విరాట | 1 - 6 |
| ,, | సారమతిన్ కవీంద్రులు . రుచిరార్థసూక్తినిధి, | భారతం-ఆది | 1 - 26 |
| 2 | పరమ వివేక . . సద్గుణ పుంజ. . రుచిరము | | |
| ,, | మహామనోహర సుచరిత్ర. . పరిపూర్ణము | ,, | 1 - 24 |
| ,, | సకల గమ్య సుతీర్థము | | |
| 4 | సంపత దశినీ . . భాషల దీవనలు | | |
| ,, | మృదు లాని లాపవర్జిత కుసుమాక్షతావళులు | ,, | 4 - 17 |
| ,, | ఆజ్య హవిర్ధృత . . మధుప ప్రకరంబులు | ,, | 4 - 21 |
| ,, | శ్రవణ సుఖంబుగా | ,, | 4 - 23 |
| ,, | సమ స్తాశాంత. . భూవలయము | ,, | 4 - 8 |
| ,, | రుజాశో కాతంకక్షయ శంకాపేతము | ,, | 4 - 9 |
| 6 | వివి ధోత్తుంగ తరంగ . . | ,, | 2 - 30 |
| ,, | జలధి విలోల వీచి . . | ,, | 3 - 144 |
| ,, | సాగర సార వారిరుహ . . | భారతం - సభా | 2 - 110 |
| 7 | మందిత సూర్యరశ్మి . . | ,, | 2 - 111 |
| ,, | ఉరుతర దావపావక . . | భారతం - ఆది | 8 - 230 |
| ,, | ఉన్మిష న్నలిన . . తరంగ సంగ తానిల . . | ,, | 8 - 232 |
| 8 | విలస త్పూగ ల ఘనవల్లి . . నూదియున్న | ,, | 3 - 140 |
| 13 | ఆపద గడవం బెట్టగ | భారతం - ఉద్యోగ | 3 - 6 |
| ,, | అక్కట లాతులైన పగరైనను | ,, | 3 - 13 |

| పుట | ఉదాహృత పద్యాదులు | కృతి | వివరం |
|---|---|---|---|
| 14 | గాండివ జ్యా నినాదమ్ము గ్రమ్మి .. | భారతం - కర్ణ | 2 - 9 |
| ,, | ఎవ్వాని వాకిట .. రాజి నడగు! | భారతం - విరాట | 2 - 191 |
| 17 | గజచర్మ మెన్నడో కాని .. | భీమఖండం | 1 - 116 |
| 18 | కన్నెలు కాఁదారి .. ధూర్త ప్రకారంబునన్ | ,, | 1 - 112 |
| ,, | వేనలి పాట పాట నరవెంద్రుకతో .. | కాశీ ఖండం | 7 - 160 |
| ,, | వేద పురాణ శాస్త్ర .. పెద్ద ముత్తైదువ | ,, | 7 - 161 |
| ,, | ఆకంఠంబుగ నీవు | ,, | 7 - 163 |
| 19 | గొడుగు బాగలు గిలుకలు కులుకరింప | ,, | 7 - 185 |
| ,, | ఆరగించితె .. యథేచ్ఛ? | ,, | 7 - 191 |
| ,, | ఎట్టు పురాణముల్ | ,, | 7 - 194 |
| ,, | మాటుగా వైచిన మాజిష్ఠ తెర | హరవిలాసం | 7 - 137 |
| 21 | అరబీ భాష, తురుష్క భాష | భీమఖండం | 1 - 73 |
| 22 | త్రవున పుష్పలతా | ,, | 2 - 56 |
| 23 | తరువున గాండివం బిడడె | చాటుపద్య మణిమంజరి[1] | పుట 23 |
| ,, | ఎట్లు చెల్లింతు .. | చాటుపద్య మణిమంజరి[2] | పుట 138 |
| 24 | ఇందరు కూడి .. మజ్జన మాచరింపుడు .. | భీమఖండం | 2 - 131 |
| ,, | వండిన బొప్పునన్ .. సర్వమంగళంబు | ,, | 2 - 133 |
| ,, | చల్లని సౌమ్య దృష్టియు | ,, | 2 - 134 |
| ,, | ధాతసతిముక్కు కోసె సోణంబు దాక | కాశీఖండం | 7 - 85 |
| ,, | చదివె గురు నొద్ద .. తార యొద్ద | ,, | 4 - 199 |
| ,, | ముగురం గూర్చిన .. లేదో సుమీ! | భీమఖండం | 3 - 6 |
| 25 | సూనాస్త్ర ప్రమదా మదస్ఫురిత | రాధామాధవం | 1 - 13 |
| 26 | పసిడి వ్రాత చెరంగు .. పింజె తోడ | మనుచరిత్ర | 3 - 71 |
| ,, | ధవళ ధవళము లగు జన్నిదముల తోడ | | |

[1] ద్వితీయ భాగం (1922 ముద్రణ) [2] ప్రథమ భాగం (1942 ముద్రణ)

| పుట | ఉదాహృత పద్యాదులు | కృతి | వివరం |
|---|---|---|---|
| 26 | భాషాపరశేషభోగి | మనుచరిత్ర | 1 - 51 |
| ,, | మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి | | |
| ,, | అవిరళజప హోమ తత్పరుడు.. | భారతం – ఆది | 1 - 9 |
| 27 | ధరియింప నేర్చిరి | భీమఖండం | 1 - 41 |
| ,, | అర్ధ చంద్రుని తేట .. లలాటపట్టి | మనుచరిత్ర | 3 - 71 |
| ,, | మార్కండేయ శివమౌళి. . సారధార | కాశీఖండం | పీఠిక,16 |
| 29 | గంధవాహ .. సైంధవము | మనుచరిత్ర | 4 - 28 |
| ,, | పులియడు బూచిగా డడవి పోతుల .. | ,, | 4 - 32 |
| ,, | చలిగాలి బొండు మల్లెల . . వెన్నెల రసంబు | ,, | 6 - 29 |
| ,, | కూకటుల్ కొలిచి చేసిన . . సోమిదమ్మ | ,, | 1 - 53 |
| ,, | వండ నలయదు .. అతని గృహిణి | ,, | 1 - 56 |
| ,, | సఖులు తలిదండ్రులు ..యిలు దీర్చుచు | ,, | 1 - 53 |
| ,, | పూచిన సంపెంగ పొలుపు . . బోలె | ,, | 1 - 52 |
| ,, | వాని చక్కదనము .. భోగబాహ్యము | | |
| ,, | చూచి ఝళం ఝళ త్కటక. . వెల్లి గొల్పు | ,, | 2 - 29 |
| 30 | ఎలప్రాయము వైదిక కర్మనిష్ఫలం బోవుట | ,, | 2 - 54 |
| ,, | అంధునకు కొరయె వెన్నెల | ,, | 2 - 56 |
| ,, | సంసా రాంధువున | | |
| ,, | సశరీర స్వర్గసుఖము | ,, | 2 - 58 |
| ,, | ఆసవమున్, ప్రియాంగన .. | వల్లకి | పుట 15 |
| 31 | రస సమంచిత .. రచన కనుకూలంబున్ | మనుచరిత్ర | 1 - 16 |
| ,, | షోడశసహస్రకామినీ.. వారణేంద్రము, | పారిజాతాపహరణం | 5 -107 |
| 32 | హితుడవు, చతుర వచోనిధివి .. | మనుచరిత్ర | 1 - 15 |
| 34 | చద్ది మిగుల నింట సంసార మేల? | వేమనసూక్తిరత్నాకరం | ప. 650 |

| పుట | ఉదాహృత పద్యాదులు | కృతి | వివరం |
|---|---|---|---|
| 34 | కుండ చిల్లికి గుడ్డ | వేమన పద్యాలు[1] | పుట 25 |
| 36 | అల్ప బుద్ధి వాని కధికార మిస్తేను.. | ,, | ,, 236 |
| ,, | చెప్పు తిన్న కుక్క చెరకు తీ పెరుగునా? | | |
| 37 | భూతి దేహమందు .. గాడిద పొరలదా? | ,, | ,, 102 |
| ,, | యోగి కానివాడు లోన బాగు కాకుండెనా! | ,, | ,, 687 |
| ,, | 'వంటకంబు నీరు వాంఛ' లుడిగేవా? | ,, | ,, 69 |
| ,, | తాను పవిత్రుణ్ణనుకుని .. | ,, | ,, 941 |
| ,, | ఆత్మ శుద్ధిలేని ఆచారం.. | ,, | ,, 67 |
| 43 | కవనార్థం బుదయించితిన్ | జయంతి | పుట 41 |
| 45 | తిరుపతి యతండు.. | నానారాజ సందర్శనం[2]: పూర్వ - గద్వాల 1 | పుట 11 ప. 52 |
| 46 | సుకవిసుందరుడు | శ్రవణానందం | 1 - 69 |
| ,, | కొండల నోర జేసికొని .. | శ్రీనివాస విలాసం | 1 - 11 |
| ,, | భారత చచ్చె కవీంద్రులందు | పాణిగృహీత (1956) | 1 - 4 |
| 47 | రాజమిత్రుల మదికాక.. | నానారాజ సందర్శనం: ఉత్తర - వనపర్తి | పు. 96 ప. 132 |
| ,, | కవితా లతాంగికిన్.. | నానారాజ సందర్శనం: పూర్వ - మొగల్‌తుర్తి | పు. 31 ప. 132 |
| ,, | కనకాభిషేకమౌగాక.. | నానారాజ సందర్శనం: పూర్వ - గద్వాల 1 | పు. 12 ప. 58 |
| ,, | నరనాథుల్ పలుమంది.. | కామేశ్వరీ శతకం | — |
| 66 | భావనాబల మున్నది .. | కావ్యకుసుమావళి [1943] సంపుటి ౧ - భాగం ౨ కవిగీతము | |

---

[1] వావిళ్లప్రతి (1955 ముద్రణ)   [2] 1951 ముద్రణ

| పుట | ఉదాహృత పద్యాదులు | కృతి | వివరం |
|---|---|---|---|
| 68 | మధురముగ, మార్దవంబుగా .. | ఏకాంతసేవ | ఖండం 4 |
| 69 | గానమాతనిది .. | కావ్యకుసుమావళి : భాగం ౨ | కవిద్వయము |
| 72 | వర మనోహర పంచమస్వరము | ఏకాంతసేవ | ఖండం 1 |
| 74 | ఈ ప్రవాస యాత్రా రతి .. | కృష్ణపక్షం[1] | పుట 104 |
| 76 | ప్రేమకుం గల్గు కారణంబు .. | బ. అ. గీతాలు[2] | ప్రేమ కారణము |
| 77 | ఇంత విరుగీతి.. | కృష్ణపక్షం | పుట 148 |
| 78 | న న్నెవ్వ రావలే రీవేళ.. | బ. అ. గీతాలు | నా కవిత్వ ధాటి |
| 79 | మంచిరోజు కాదోయి .. | ,, | హెచ్చరిక |
| ,, | పాడ దలచిన పాటలన్నీ .. | ,, | గురువర్య |
| ,, | మండిపోతున్న వండోయ్ .. | ,, | ప్రళయాగ్ని |
| ,, | ఎంతటి చపలుండ నైతి ! | ,, | తెలియని వలపు |
| ,, | కోయిలా కోయిలా కూయబోకే ! | ,, | కోయిల |
| ,, | లోకాని కుత్తుత్త దీపావళీ ! | ,, | దీపావళి |
| ,, | లేప నైనా లేప లేదే ! | ,, | యశోధరా .. |
| ,, | ఆ మబ్బు ఈ మబ్బు .. | ,, | ఐక్యమౌదామె |
| ,, | కత్తిపెట్టి పొడిచాడు .. | ,, | దోపిడి |
| ,, | మరవలేదే నిన్ను .. | ,, | నిర్వాణ సుఖము |
| ,, | కోయి లొకసా రొచ్చి .. | ,, | నడమంత్రపుసిరి |
| 82 | వేదాద్రి శిఖరాన వెలిగిన్న .. | ,, | జీర్ణం జీర్ణం |
| 84 | ఈ మహాగహనాంతర సీమ .. | ,, | చెవిటి మల్లయ్య |
| 85 | బ్రతుకు బరువు మోయలేక .. | ,, | నా ముక్తి |
| 100 | నా నోట నీ మాట .. | మహతి | గీతం 21 |
| 101 | దేవు డల్లే లోన తిరిగి తిరిగి | యెంకి పాటలు | పడవ |
| 104 | ఈ నా పదార్పిత క్షోణి .. | ఆంధ్ర ప్రశస్తి | వేగిక్షేత్రము |

[1] కృష్ణపక్షము - ప్రవాసము - ఊర్వశి (1975 ముద్రణ)
[2] బసవరాజు అప్పారావు గీతాలు